హరిః ఓమ్ తత్ సత్

శ్రీ రామతారక పరబ్రహ్మణే నమః

# శ్రీ చాతుర్మాస్య మాహాత్మ్యము



న బో ధా త్ప ర మం సు ఖ మ్

రచన:

**సద్గురు శ్రీ మలయాళస్వాములవారు**


- ప్రకాశకులు -

శ్రీవ్యాసాశ్రమము

వ్యాసాశ్రమము- పోస్టు, మార్గము - ఏర్పేడు,

చిత్తూరు జిల్లా , (ఆం.ప్ర.), ఫోన్ - 08578 -287528

2002

| | |
|---|---|
| 1994 వ సం॥ వరకు | 3000 ప్రతులు |
| 2002 వ సం॥ | 2000 ప్రతులు |

వెల: రూ. 15-00

ప్రకాశకులు:-

శ్రీ వ్యాసాశ్రమమువారు

ప్రతులకు :-

మేనజరు , శ్రీవ్యాసాశ్రమము
వ్యాసాశ్రమము- పోస్టు, మార్గము - ఏర్పేడు,
చిత్తూరు జిల్లా , (ఆం.ప్ర.) - 517 621

ముద్రణ

శ్రీ పారాశర్య ప్రెస్,
శ్రీ వ్యాసాశ్రమము

“ ఓమిత్యేకాక్షరం బ్రహ్మధ్యేయం సర్వముముక్షుభిః”




“ వర్ధతాం బ్రహ్మ విద్యా చ లోకేభ్య స్సుఖమేధతామ్”

ఓమ్



మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వాములవారు

# విషయసూచిక



# పీఠిక

ఈ చాతుర్మాస్యవ్రత మాహాత్మ్యము ఈ దేశములో నెరింగి యను ష్ఠించువారు చాలా అరుదుగా నున్నారు. ఉత్తర హిందూస్థానములో నిది బహుళముగా ప్రచారములో నుంటున్నది. కారణమేమనగా, ఆ దేశములో బ్రహ్మనిష్ఠులు, మఠాధిపతులు,సన్న్యాసులు ఎక్కువగా నున్నారు. ఇప్పుడిప్పుడు ఈ దక్షిణదేశమున అచ్చటచ్చట ఆశ్రమములు, మఠములు, యతీశ్వరులు నేర్పడినందుచేత అనేకులు చాతుర్మాస్యవ్రతమనగా నేమి, దాని నియమము లెట్టివి అని యడుగుచున్నారు. దీనియందు సన్న్యాసులు ముఖ్యులని తెలిపి నను వారి ననుసరించి గృహస్థ స్త్రీ పురుషులు గూడ ఈ వ్రతమును సలుపు చుందురు. దీనికి చాతుర్మాస్యవ్రత మాహాత్మ్యములోనే ప్రమాణము గలదు. దానిని క్రింద గనందగును. శ్రీబుద్ధదేవుని పుణ్యయుగమున ఈ వ్రతము బహుళముగా ప్రచారమందుండెను. జైనులును ఈ మహావ్రతమును చక్కగా నాచరించువారు. శాస్త్రోక్తముగా సన్న్యసించిన పరివ్రాజకులు తప్పక ఈ పావన వ్రతము ననుష్ఠించి పవిత్రులగువారు . చాతుర్మాస్యము నాలుగు మాసములు పూర్తిగా కొందఱు మాత్రమే యనుష్ఠింతురు. మఱికొందరు అర్ధచాతుర్మాస్యము (రెండుమాసములు) అనుష్ఠించువారుగూడ గలరు. ఇది రెండవ పక్షము.

చాతుర్మాస్యవ్రతమాహాత్మ్యమను ఒక గ్రంథము నాగరలిపిలో సంస్కృతమున ప్రత్యేకముగా గలదు. కాశీలో నిది దొరకును. ధర్మసింధు, నిర్ణయ సింధు మొదలగు మహోన్నత గ్రంథములలో ఈ చాతుర్మాస్యవ్రత నిర్ణయ మును గురించి సంక్షిప్తముగా చెప్పబడియున్నది. శ్రీమద్భాగవత ప్రథమ స్కంధమందు శ్రీ నారద మహర్షి పూర్వజన్మ వృత్తాన్తమును తెలిపెడు భాగమున దీనిని గనందగును.

శ్రీనారదుడు తాను పూర్వజన్మమున దాసీపుత్రుడననియు, అత్తఱి చాతుర్మాస్య వ్రతమును సలిపెడు నలుగురు యతీశ్వరులకు కావలసిన పరిచర్యలను తన తల్లి సలుపుచుండెనియు, ఆ సమయమున తాను బాలుడై యుంటిననియు, ఆ యతీశ్వరులు సలుపుచుండు వ్రతములను, భజనలను, బ్రహ్మవిచారములను చూచుచు తానచ్చటనే యుంటిననియు, వారు భుజించెడు

ప్రసాదము తనకున్ను ఇచ్చుచుండిరనియు, అందువల్లనే పావనమగు ఈ నారదజన్మము తనకు గలిగెననియు తానే స్వయముగా చెప్పియున్నాడు.

స్కాందపురాణాన్తర్గతమగు శ్రీ కార్తిక మాహాత్మ్యగ్రంథము నందలి యెక్కువ భాగములు ఈ గ్రంథము వ్రాయుటకు తోడ్పడెను. ఈ పావన వ్రతమును శ్రీ విష్ణుమూర్తియే నైమిశారణ్యములోగల జ్ఞానసిద్ధి మొదలగు మహాఋషులకు తెలిపినట్లు గలదు. దానిని వసిష్ఠమునీంద్రుడు జనక మహారాజున కుపదేశించినటు లీగ్రంథమున గానంబడుచున్నది.

ఆంధ్రదేశమున పరివ్రాజకులు, బ్రహ్మవిచారణపరులు ఎక్కువగా నేర్పడుచుండు ఈ పుణ్యకాలమున ఇట్టి గ్రంథము లోకమునకు ఎంతయో మేలొనర్పగలదని తోచుటచేతను, అనేకులు ఈ వ్రతముయొక్క పుట్టుపూర్వోత్తరము లెటుల నున్నవని అడుగుటచేతను దీనిని గ్రంథరూపముగా చేయడమైనది.

మఱియు, చాతుర్మాస్య వ్రతానుష్ఠానమునకు గృహస్థులు అర్హులు కారనియు, అంతియేగాక స్త్రీలసలే యనర్హులనియు లోకములో గల దుర్వదంతులు శమించుటకొఱకును, ఈ చాతుర్మాస్య మాహాత్మ్యమున గల ప్రమాణములు ఇచ్చుట నిరూపితము లగుచున్నవి.

పాపీయాంసో దురాత్మానస్సాధవో వా హరిప్రియాః ।
వ్రతం సమాచరేత్సమ్యక్ప్రాప్తే మాసచతుష్టయే ॥

బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాశ్శూద్రాశ్చాపి తథా పరే ।
పత్న్యః స్త్రీ జనాస్సర్వే వ్రతస్థా విష్ణుతుష్టయే ॥

అభర్తా వా సభర్తా వా తథా కాషాయధారకః ।
ఆవశ్యకమిదం భద్రం వ్రతం సమ్యక్సమాచరేత్ ॥

ఈ చాతుర్మాస్య వ్రతసమయమున భగవత్ప్రీతి కొరకు పాపాత్ములు, దుష్టబుద్ధిగలవారు, సాధువులు, భగవద్భక్తులు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, తదితరులు, సువాసినులు, వితంతువులు, సన్న్యాసులు, యోగులు, యోగినులు - అందరు ఈ మహావ్రతమును తప్పక ఆచరించ

వలయును. అట్టివారు భగవత్సాయుజ్యమును పొందుదురు. దీనికన్న ప్రబల ప్రమాణము మరియేమి కావలయును?

శ్రీ గాంధీగారి ఆత్మకథ పద్యకావ్యమునుండి :-

గాంధీజీ తల్లిగారగు పుత్తలీబాయమ్మగారిని గురించిన విషయము- వీరు ప్రతిసంవత్సరము చాతుర్మాస్యవ్రతము సలుపునదేగాక ప్రతిరోజును సూర్యనమస్కారము చేసిన తరువాత భోజనము చేయువారు. ఒక్కొక్కప్పుడు వానకాలమున మబ్బుపట్టిన రెండు మూడు రోజులు సూర్యదర్శనము కానిచో భోజనము చేయరు.

అట్టి వ్రతనిష్ఠ కలిగియుండుటవల్లనే లోకోత్తర పురుషుడగు గాంధీగారు ఆమె గర్భములో జన్మించిరి. ఇది పురాణకల్పిత కథగాదు. అంద రెరింగిన విషయము.

చిత్తమ్మున మజ్జననియు నుత్తమసతియన్న భావ మొదవెను నాకున్
బత్తియుబ్రపత్తియును రేకెత్తగ నగ్గరిత దేవు నెపుడుం దలచున్.

ఆయమ్మ దేవతార్చన సేయక బోనంబు నెపుడు జేయద మఱియున్
బాయక విష్ణ్వాలయమున కేయెడ నేవనుదినంబు నేగుచునుండున్.

నా యెఱిగినంతవట్టు చాతుర్మాస్యము నామె విడువ దయ్యె. నయ్యమ్మ కఠినదీక్షారక్షితంబులగు వ్రతంబులు సతంబు నిరంతరాయముగా నాచరించు - నెట్టి యిక్కట్టు ముట్టడించినను దా బట్టిన నోము నుజ్జగించుట మజ్జనని యెఱుంగని కర్జంబు-చాంద్రాయణము నెఱపుతఱి నాపెకుదెవులు సోకుటయు నయ్యాపయమ్మున కామె నేమంబు నేమాత్రముం జెఱు పనయితి గామియు నెఱుంగుదు- రెండు మూడు కఠినోపవాసమ్ములా సాధ్వీమతల్లికకు నల్లేరుపై బండినడకంబోని-వామెకు జాతుర్మాస్యల యందేక భుక్తంబ నియమ-మంతం దనివోక యొకదాన నయ్యమ్మ వాసరోపవాసంబు నాసించె- గొండొక దాన భానుసందర్శనంబైన గాని బోనంబు ముట్టనను కట్టడిజేసికొనె-నపుడు నాపైదోడులంగూడి వేడివెలుంగు కాననయ్యెనని మాయమ్మకు న్వినుచుటకేను

మిన్నుమానికంబుపై గన్ను నిలిపియుండు వాడ-నడి జడికారునం బ్రాయికంబుగా నంబుజబాంధవుండు కంటంబడమి యెల్లరకుం దెల్లంబ, యాకస్మికముగా లోక బాంధవుడు దర్శనం బొసగుడునే మొక్క గంతునం బోయి యయ్యుదంత మమ్మకు నివేదించువార మాసుశీల పరుగుపరుగున వచ్చు నీలోన నాభాస్కరుండు మేఘచ్ఛన్నుడగుడు నామె "పోనిండు నేడు నాయారగించుట భగవానున కసమ్మతము గాబోలు" నని వేడుకమై నాటి యింటిపనుల జక్క దిద్ద నరుగు. వెండియు

కానంబడు వ్యవహారజ్ఞానము మా తల్లియందఖండమ్ముగసం
స్థానస్థవిశేషంబు లనూనముగా దెలియునామె కుశమతి యగుటన్

మఱియు గీతయందు శ్రీకృష్ణభగవానుడు చెప్పినది చూడుడు.

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేஉపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేஉపి యాన్తి పరాం గతిమ్ ॥

ఓ అర్జునా! యెవరు పాపజన్మ గలవారో వారును, స్త్రీలును, వైశ్యులును, శూద్రులును నన్నాశ్రయించి సర్వోత్తమమైన గతిని పొందుచున్నారు.

అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మంతవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః ॥

మిక్కిలి దురాచారము గలవాడైనను నన్ను అనన్యగతితో భజించిన యెడల అట్టివాడు నాయెడ దృఢనిశ్చయము గలవాడగుచున్నాడు గదా! ఆ కారణమువలన అతడు శ్రేష్ఠుడని తలంపవలయును.

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।
కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥

పై జెప్పబడినట్టివాడు శీఘ్రముగా ధర్మాత్ము డగుచున్నాడు. శాశ్వత మైన శాంతిని నిశ్చయముగా పొందుచున్నాడు. ఓ అర్జునా! నా భక్తుడు నాశమొంద డని పండితసభలో ప్రతిజ్ఞ చేసి చెప్పుమా!

ఇక ఈ విషయమై యెక్కువ ప్రమాణములను జూపి గ్రంథ బాహుళ్యము జేయ తలంచలేదు. చాతుర్మాస్య వ్రతమును గురించిన విషయ ములను ఎవరైన సప్రమాణముగా వ్రాసి పంపినచో, పునర్ముద్రణమునందు జేర్చి అచ్చువేసెద. లోకశ్రేయస్సునుకోరి సర్వవిధములుగా ప్రవర్తించెడు స్వభావము పుణ్యాత్ములకు గలదుకదా! పాపులను పవిత్రులనుగా నొనరించెడు సంఘసంస్కరణము భారతదేశములో కొరతపడి యుండినందు చేతనే యీ దేశము ఉన్నత స్థానములోనికి రాకపోవుట అని యిప్పుడిప్పుడు విజ్ఞులందరు తెలిసికొనుచున్నారు.

శ్రీబుద్ధదేవుని కాలమందు సంఘసంస్కరణము బహుళముగా నుండినందుచేతనే బౌద్ధమత మున్నతస్థితిలోనికి వచ్చినది. ఈ మధ్య ఆర్యస మాజ మతస్థాపకులగు శ్రీదయానంద సరస్వతీ స్వాములవారును, బ్రహ్మ సమాజ స్థాపకులగు శ్రీరామమోహన్‌రాయిగారును కొంత ప్రయత్నించినను వారి తోనే దాని యభివృద్ధి తగ్గిపోయెను. వారి అనన్తరము వారివంటి పండితోత్తములును, త్యాగపురుషులును లేకపోవుటచేతనే అంతటితో నది యాగిపోయెను. శ్రీయేసు, శ్రీమహమ్మదు మొదలగు ప్రవక్తల అనుయా యులు చాలవరకున్ను పైవారివలె త్యాగపురుషులై ప్రవర్తించినందుచేతనే ఆ మతములు లోకవ్యాప్తి నొందినవి. భారతీయ మతకర్తలలో చాలామంది వారివారి మతములను వ్యాపింపజేయుటలో యత్నించిరేగాని మానవులను సంస్కరించుటలో అంతగా ప్రయత్నమును చేయలేదు.

అదియునుగాక రోగులకు ఔషధము, వైద్యుడున్ను ఏర్పడిరను తత్త్వమును మరచిపోయి, ఆరోగ్యస్థితిలో నుండువారికే ఆయుర్వేదమున్ను, భిషగ్వరులున్ను ఏర్పడిరను తత్త్వములోనికి వారి మనస్సు జారిపోయినందు చేతనే దేశ మభివృద్ధిలోనికి రాదయ్యెను. అనాథులై దిక్కులేనివారై పాపకర్మము లలో మునింగియుండు మానవకోట్ల నుద్ధరించెడివారు లేకపోవుటయే భారతదేశము మరింత అధోగతికి వచ్చుటకు కారణము. గాంధీమహాత్ముడు మొదలగు పుణ్య పురుషులు ఈ తత్త్వము నెఱింగి యిప్పుడిప్పుడు జనులను

సంస్కరించుటకు యత్నించినందుచే ఇంతవరకైనా లోకము నెమ్మదిస్థితిలోనికి వచ్చినది. జనులలో గల మూఢవిశ్వాసము చాలవరకు నశించిపోవుటచేతను, విజ్ఞాన మభివృద్ధిలోనికి వచ్చినందుచేతను ఇక మీద భారతదేశము ఉచ్చస్థితిలోనికి రాగలదని తలంచెదను. కరుణామూర్తియగు సర్వేశ్వరుడున్ను, పరమపావనులగు మహాఋషులున్ను లోకోన్నతి గలుగులాగున నను గ్రహింతురు గాక!

లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఇట్లు మీ చరాచర సుఖాభిలాషియగు

శ్రీమలయాళస్వామి



# శ్రీ చాతుర్మాస్య మాహాత్మ్యము

## ప్రథమాధ్యాయము

### కాలనిర్ణయము

ఆషాఢే తు సితే పక్షే ఏకాదశ్యాముపోషితః ।
చాతుర్మాస్యవ్రతం కుర్యాద్యత్కించిన్నియతో నరః ॥

ఆషాఢమాసమున శుద్ధ ఏకాదశియందు ఉపవాసముండి ధర్మసింధు, నిర్ణయసింధు మొదలగు గ్రంథములలో తెలుపబడిన నియమములను కొన్నిటి నైన అనుష్ఠించుచున్నవాడై మానవుడు చాతుర్మాస్యవ్రత మాచరించవలయును.

ధర్మసింధు, నిర్ణయసింధు గ్రంథములలో చాతుర్మాస్యవ్రతము ఆషాఢ పూర్ణిమ రోజునుండి గూడ ప్రారంభించవచ్చునని గలదు. ఆంధ్రదేశమున అమావాస్యపోయిన మరుదినము పాడ్యమినుండి మాసము ప్రారంభించి, మరు అమావాస్య దినమునకు మాసము పూర్తి అగును. వింధ్యపర్వతమునకు ఉత్తర మున పూర్ణిమ పోయిన మరురోజు కృష్ణపక్ష పాడ్యమి నుండి మాసమారంభించి మరు పూర్ణిమ దినమునకు పూర్తి అగును. కావున పూర్ణిమ నుండి పూర్ణిమకు నెల పూర్తి గాగలదను నియమమును వ్రతనిష్ఠులు గ్రహించుకొనవలయును. శాలివాహనాది సంవత్సరములు ఈ నియమము ననుసరించి యుండును.

చతుర్ధా గృహ్యవైచీర్ణం చాతుర్మాస్యవ్రతం నరః ।
కార్తికే శుక్లపక్షే తు ద్వాదశ్యాం తత్సమాపయేత్ ॥

నాలుగుమాసములలోను బాగుగా నాచరించబడిన ఈ చాతుర్మాస్య వ్రతమును కార్తికమాసమున శుద్ధద్వాదశియందు పూర్తి చేయవలయును.

కావుననే ఆషాఢ శుద్ధ ఏకాదశికి శయనైకాదశి యనియు, కార్తిక శుద్ధ ద్వాదశికి ఉత్థాన ద్వాదశి యనియు పేర్లు గలిగినవి.

క్షీరాబ్ధౌ శేషపర్యంకే ఆషాఢ్యాం సంవిశేద్ధరిః ।
నిద్రాం త్యజతి కార్తిక్యాం తయోస్సంపూజయేత్సదా ॥

శ్రీవిష్ణుభగవానుడు పాలసముద్రమున శేషశయనముపై ఆషాఢ మాసమున శయనించుచున్నాడు. తిరిగి కార్తికమాసమున నిద్రను వదలుచున్నాడు కావున ఆ మాసములలో శ్రీహరిని సదా పూజించవలయును.

సుప్తే త్వయి జగన్నాథే జగత్సుప్తం భవేదిదమ్ ।
విబుద్ధే తు విబుద్ధ్యేత ప్రసన్నో మే భవాచ్యుత! ॥

ఆషాడ శుద్ధ ఏకాదశినుండి కార్తికశుద్ధ ద్వాదశివరకు క్షీరసాగరమున ఆదిశేషునిపై శ్రీ మహావిష్ణువు యోగనిద్రయందుండుట వలన ఈ నాలుగు మాసములు భక్తులు, సాధువులు, యోగులు, మునులు ముఖ్యముగా సన్యాసులు ప్రాపంచిక వ్యవహారములను మాని ధ్యాన జపహోమాదికార్యము లనుజేయుచుండవలయును. ఓ భగవంతుడా! నీవు నిద్రించుటవల్ల ప్రపంచ మున్ను నిద్రించును. నీవు మేలుకొనిన ఈ జగమంతయు మేలుకొనిన దగును. అందువలన అచ్యుతా! మాకు ప్రసన్నుడ వగుము.

సుప్తే త్వయి జగన్నాథే జగత్సుప్తం భవేదిదమ్ ।
విబుద్ధే త్వయి బుద్ధ్యేత తత్సర్వం సచరాచరమ్ ॥

ఓ జగన్నాయకా! మీరు నిద్రించిన ఈ చరాచర జగమంతయు నిద్రించును. మీరు మేలుకొనిన ఈ చరాచర ప్రపంచమంతయు మేలు కొనును.

ఈమంత్రమును ఆషాఢశుద్ధ ఏకాదశి బ్రహ్మముహూర్తమున, వ్రత గ్రహణకాలమందు పఠించవలయును. ఆరంభమున శ్రీకృష్ణపటమును గాని, విగ్రహమునుగాని ప్రతిష్ఠించి కుడిప్రక్క తన యిష్టదైవమును, ఎడమ ప్రక్క తన గురుదేవుని పటమును పూజలో పెట్టవచ్చును. పుణ్యాహవాచనాది మంత్ర విధానమును సల్పి, కలశస్థాపనమును చేయుదురు.

ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద త్యజ నిద్రాం జగత్పతే ।
త్వయి సుప్తే జగన్నాథ జగత్సుప్తం భవేదిదమ్ ॥

ఉత్థితే చేష్టతే సర్వం ఉత్తిష్ఠోత్తిష్ఠ మాధవ ।
ఇదం వ్రతం మయా దేవ కృతం ప్రీత్యై తవ ప్రభో ॥

న్యూనం సంపూర్ణతాం యాతు త్వత్ప్రసాదాజ్జనార్దన ।
జగదాదిర్జగద్రూపో జగదాదిరనాదిమాన్ ।
జగదాద్యో జగద్యోనిః ప్రీయతాం మే జనార్దనః ॥

ఓ భగవానుడా! శ్రీగోవిన్దా! యోగనిద్రనుండి మేలు కొనుమా, మేలు కొనుమా, శ్రీ జగన్నాథా! మీరు నిద్రించిన, జగత్తు నిద్రించిన దగును. మీరు మేల్కాంచిన జగత్తంతయు మేల్కొని తత్తత్కర్మములలో నిరత మగును. కనుక ఓ మాధవా! లెమ్ము లెమ్ము, ఓ దేవా! యీ వ్రతము తమ ప్రీతి కొఱకు ననుష్ఠింపబడినది. దీనిలో న్యూనమైనను ఓ జనార్దనా! పూర్తినొందుగాక, ఓ ప్రభో! మీరు జగత్తునకు మొదలయినవారు, జగద్రూపులు, అనాదిగా నుండువారు, జగన్మూల కారణభూతులు. ఓ జనార్దనా! నావిషయమై ప్రీతి నొందుదురుగాక!

ఈ మూడు మంత్రములను కార్తికశద్ధ ద్వాదశి వ్రతసమాప్తికాలమున పఠించవలయును. ఆరంభములోను, అవసానములోను సంకల్పము విధ్యుక్తముగా చేసికొనవలయును.

## నియమము

శ్రావణే వర్జయేచ్ఛాకం దధి భాద్రపదే తథా ।
దుగ్ధమాశ్వయుజే మాసి కార్తికే ద్విదళం తథా ॥

శ్రావణమాసమున కూరగాయలను,భాద్రపదమాసమున పెరుగును, ఆశ్వయుజ మాసమున పాలను, కార్తికమాసమున పప్పుదినుసులను వర్జించ వలయును.

బ్రహ్మచర్యము, ఏకభుక్తము కర్తవ్యములు. ఈ వ్రతకాలము నాలుగు మాసములలో ఏదైన తన యిష్టదేవతా దివ్యమంత్రముయొక్క అక్షరలక్ష జపమునుగాని, ఏదైన నుపనిషత్తును పూర్తిగా పఠించుటగాని, శ్రీభగవద్గీతలో కొన్ని అధ్యాయములను కంఠస్థముగాని చేయవలయును. యోగసాధనలు కొన్నిటిని శీలించుకొనుటయు మంచిది. ఈ నాలుగుమాసములలో తాను నివసించెడు గ్రామముయొక్క ఎల్ల దాటి పోకూడదు. దీక్ష వహించి యుండ వలయును.

**చాతుర్మాస్యే కృతైః పుణ్యైః విశేషాత్ప్రీతిమశ్నుతే ।**
**అతః సర్వప్రయత్నేన చాతుర్మాస్యం ముముక్షుభిః ॥**

చాతుర్మాస్య వ్రతమునందు జేయబడు దానధర్మాది పుణ్యకర్మలచే భగవానుడు మిక్కిలి ప్రీతినొందును. అందువలన సర్వవిధ ప్రయత్నములచేత ముముక్షువులు ఈ పుణ్యమగు చాతుర్మాస్యవ్రతము ననుష్ఠించవలయును.

చాతుర్మాస్యవ్రతములో చేయుచుండు దానధర్మాదులు సాక్షాత్తు భగవంతునికే చెందునట్లు తలంచవలయును.

**ఇమం కరిష్యే నియమం నిర్విఘ్నం కురు మేఽచ్యుత ।**
**ఇదం వ్రతం మయా దేవ గృహీతం పురతస్తవ ॥**

ఓ దేవా! ఈ వ్రతమును మీ ముందరనే గ్రహించితిని. కావున ఓ అచ్యుతా! ఈవ్రతము నాచరించబోవుచున్నాను. విఘ్నము లేకుండ జేయుమా!

వ్రతగ్రహణ కాలమున భగవత్సన్నిధిలో సంకల్పము చేసి యీ మంత్రమును పఠించవలయును.

**ఏకభుక్త మధశ్శయ్యా బ్రహ్మచర్యమహింసనమ్ ।**
**వ్రతచర్యా తపశ్చర్యా కృచ్ఛ్రచాంద్రాయణాదికమ్ ।**
**దేవపూజా మంత్రజపో దశైతే నియమాస్స్మృతాః ॥**

నియమములు: 1. ఏకభుక్తము, 2. భూమియందు పరుండుట,

3.బ్రహ్మచర్యపాలనము, 4. అహింసావ్రతము, 5. వ్రతము లాచరించుట, 6.తపమొనరించుట, 7. కృచ్ఛ్రము, 8. చాంద్రాయణాది వ్రతముల నలుపుట, 9.దైవపూజను చేయుట, 10. దివ్యమంత్ర జపమొనరించుట ఈ పదియు నియమములు.

ప్రథమాధ్యాయము సమాప్తము



# ద్వితీయాధ్యాయము

## వ్రత ప్రారంభము

(స్కాందపురాణాంతర్గత కార్తిక పురాణమునుండి)

ఉద్భూతపురుషః -

మునే స్వనుగృహీతోఽస్మి త్వత్తోఽహం తు మహామతే ।
లబ్ధజ్ఞానోఽస్మి విప్రేన్ద్ర ప్రసాదాత్తవ దర్శనాత్ ॥ 1

పితా భ్రాతా గురుస్త్వం హి శిష్యోఽహం తవ సువ్రత ।
తం చాపి దుర్భగస్యాథ స్థాణుభూతస్య సామ్ప్రతమ్ ॥ 2

క్వ చ దుష్కృతపాపోఽహం క్వ చేయం సద్గతిర్మమ ।
క్వచాహం కార్తికః పుణ్యం క్వ చాహం దుష్కృతాలయః ॥ 3

క్వ చ తేషాం దర్శనం చ క్వ చాయం విష్ణుసన్నిధిః ।
సుకృతస్య ఫలం విప్ర సత్యం ప్రారబ్ధకర్మణః ॥ 4

పునర్బోధయ మాం ప్రీత్యా కృపా చేదస్తి తే మయి ।
కథం కర్మాణి మనుజైః క్రియంతే విధినా మునే ॥ 5

కథం తేషాం ఫలం తద్వత్కథం తదుపదేశనమ్ ।
కః కాలః కాని కర్మాణి కిముద్దిశ్య సమభ్యసేత్ ॥ 6

పునస్సమ్యక్ సమాచక్ష్వ శ్రోతు మిచ్ఛామ్యహం శుభమ్ ।
త్వద్వాగ్వజ్రాయుధోత్పాతాత్పాపశైలః పపాత హ ॥ 7

పునః కర్మాణి మాం బోద్ధుమర్హసి త్వం మహామతే ।

విత్తపుడాతనికి నమస్కరించి, ఓ మునిచంద్రా! నీదర్శనమువలన నేను ధన్యుడనైతిని. నాకు జ్ఞానోపదేశ మొనరించితివి. కావున నీకు నేను శిష్యుడను, నీవు నాకు జనకుడవు, గురుడవు, అన్నవు. నేచేసిన పూర్వపుణ్యమువలన కదా యిట్టి కలయిక తటస్థించినది. లేనిచో మహాపాపినై శుష్కతరురూపమునమన్న నేనేడ, నీదర్శనమేడ, సద్గతియేడ, పుణ్యఫలప్రదాయియగు శ్రీకార్తికమాసమేడ, పాపాత్ముడనగు నేనేడ, ఈ విష్ణుమందిరమున రాతటస్థించుటేడ, ఇచ్చట మహాత్ములగు మీ సమావేశమేడ, ఇంకను నాయందు శిష్యవాత్సల్యముతో దయయుంచి కర్మనుగూర్చి విస్తరించి వచింపుడు. శిష్య వాత్సల్యముతో దయయుంచి కర్మనుగూర్చి విస్తరించి వచింపుడు.సత్కర్మలను మానవు లెట్లా చరింపవలయును? వాటి యుపదేశ మేరీతి? ఫలమెయ్యది? ఏకాలమందు తత్కర్మల నాచరింపవలయును? కర్మలనెట్టివి? ఏ భావముతో జేయ వలయును? శుభఫలదంబగు ఈ కర్మ ఫలప్రభావమును వినగోరుచున్నాము. నీ వాక్కనెడి వజ్రాయుధముచే నా పాపపర్వతము కూలబడినది. నా ప్రశ్నల కుచితరీతి సమాధాన మీయ వేడుచున్నానని పలికె.

అంగిరసః :-

సాధు సాధు త్వయా పృష్టం యన్మామద్భుతమానవ ॥ 8
సర్వలోకహితార్థం తు యత్త్వయోక్తమిదం శుభమ్ ।

శృణుష్వ సావధానేన యత్పృష్టం తద్బ్రవీమ్యహమ్ ॥ 9
అనిత్యం దేహమాసాద్య విస్మృత్యాత్మానమక్షధీః ।
న ద్వంద్వమాత్మనః క్వాపి సర్వదేహస్య జాయతే ॥ 10
తస్మాత్సందేహభాజీ యః క్రమాత్కర్మప్రవర్తకః ।
తత్కర్మణా జ్ఞానసిద్ధిర్జ్ఞానాదాత్మ ప్రకాశనమ్ ॥ 11

స్నానాది సర్వకర్మాణి త్వయి విద్యోతితాని చ ।
భక్త్యా సమాచరేత్కర్మ దేహీ సమ్యగ్విధానతః ॥ 12

వర్ణాశ్రమవిభాగాదీన్నాతిక్రామన్యథావిధి ।
తేషాం యత్కర్మవిహితం జ్ఞాత్వా పశ్చాత్సమాచరేత్ ॥ 13

స్నానేన రహితం కర్మ హస్తిభుక్తకపిత్థవత్ ।
ప్రాతఃస్నానం ద్విజాతీనాం శస్తం చ శ్రుతిచోదితమ్ ॥ 14

ప్రాతఃస్నానే హ్యశక్తశ్చేత్పుణ్యం మాసత్రయోత్తమమ్ ।
తులాసంస్థే దినకరే కార్తిక్యాం తు మహామతే ॥ 15

మకరస్థే రవౌ మాఘే వైశాఖే మేషగే రవౌ ।
మాసత్రయేషు పుణ్యేషు ప్రాతస్స్నానం దినేదినే ॥ 16

యః కుర్యాత్స హరేర్లోకం ప్రయాతి పరమాం గతిమ్ ।
కాలస్తు ప్రాతరేవాస్య తథా మాసత్రయం శుభమ్ ॥ 17

చాతుర్మాస్యాదిపుణ్యేషు కాలేషు విహితం చరేత్ ।
సోమసూర్యోపరాగేషు తథైవాన్యదినేషు చ ॥ 18

కాలాంతరే విజానీయాత్ కాల్యే కర్మఫలప్రదమ్ ।
స్నానం సంధ్యా జపో హోమస్తథా సూర్యాభివాదనమ్ ॥ 19

అవశ్యం తత్ ద్విజాతీనాం యస్స్నానం న సమాచరేత్ ।
న యాతి రౌరవం ఘోరం కర్మభ్రష్టోఽపి జాయతే ॥ 20

తస్మాత్కార్తికమాసస్య యః కాలః పురుషార్థదః ।
న కార్తికసమో మాసః న కాలః కార్తికాత్సమః ॥ 21

న వేదసదృశం శాస్త్రం న తీర్థం గంగయా సమమ్ ।
న కులేన సమం బ్రాహ్మ్యాత్ న సుఖం భార్యయా సమమ్ ॥ 22

న ధర్మేణ సమం మిత్రం న జ్యోతిశ్చక్షుషా సమమ్ ।
న కార్తికసమో మాసో న దేవః కేశవాత్పరః ॥ 23

యః కుర్యాత్కార్తికే మాసి ధర్మాన్కర్మవిదుత్తమః ।
క్రతుకోటిఫలం ప్రాహుః స విష్ణోరాలయే వసేత్ ॥ 24

అంగీరసుడు:- ఓ విత్తవుడా! నీ వడిగిన ప్రశ్నలన్నియు సమంజసములు, పరుల కుపకరించునని, సదుత్తరముల నిచ్చుచుంటి నాలింపుము.

మానవుడు అస్థిరంబగు నీ శరీరమును స్థిరమని నమ్మి ఆత్మజ్ఞాన శూన్యుడగుచున్నాడు. భేదము శరీరములకేగాని ఆత్మకు లేదు. అట్టి ఆత్మజ్ఞానోద్భవంబునకే ప్రపంచమందు సత్కర్మల నాచరింపవలయునని శాస్త్రములు చెప్పుచున్నవి. సత్కర్మలు ఫలదాయకములా యను సంశయమందక భక్తిశ్రద్ధాన్వితులై సత్కర్మల నాచరించి వాని ఫలమును పరమేశ్వరార్పిత మొనరించిన జ్ఞానము గలుగును. మానవుడు, ఏజాతి కెట్టికర్మలను వేదములు విధించినవో తెలిసికొని, విధి విధానమున తత్కర్మల నాచరింపవలయును. బ్రాహ్మణున కరుణోదయ స్నానమాచరింపకయే సత్కర్మలాచరించినను వ్యర్థమగును. ప్రతిదిన మరుణోదయ కాలమునకు స్నానము జేయ శక్తి లేని బ్రాహ్మణుడు కార్తికమాసమున సూర్యుడు తులారాశియందుండగాను, మాఘమాసమున సూర్యుడు మకరరాశి యందుండగాను, వైశాఖమాసమున సూర్యుడు మేషరాశి యందుండగాను, ఈ మూడుమాసము లందైనను తప్పక ప్రాతస్స్నానము చేయవలయును. అట్లు చేసిన వైకుంఠవాసము సిద్ధించును.

పై మూడు మాసములందును చాతుర్మాస్యమునందును అరుణోదయ స్నానము ముఖ్యము. సూర్యచంద్ర గ్రహణములయందును, ఇతర పుణ్య సమయమందును వేరొక కాలమున స్నానము చేయవచ్చును. ప్రాతఃకాలమున స్నానముచేసిన మానవుడు సంధ్యావందన జపహోమ సూర్యనమస్కారముల జేయవలయును. ఇట్లు చేయని వానిని కర్మభ్రష్టుడందురు. కార్తికమున అరుణోదయ స్నానమాచరించిన వానికి చతుర్విధ పురుషార్థములును సిద్ధించును. కార్తికమాసముతో సమానమైన మాసము, వేదముతో తుల్యమైన శాస్త్రము, గంగకు సాటివచ్చు తీర్థము, బ్రాహ్మణులకు సమానమైన జాతి, భార్యతో సమానముగా సుఖమిచ్చునది, ధర్మముతో సమానమగు స్నేహితుడు,

కంటికి సమమైన వెలుగు, శ్రీహరి కెనవచ్చు దేవుడును లేరు. కార్తికమాసమున విధ్యుక్తముగా స్నానాదుల నొనరించిన మానవుడు కోటియాగముల ఫలము నొంది వైకుంఠమున కేగు నని చెప్పుటయు, నావిత్తపుడు మరల నంగిరసున కిట్లనియె. ఉద్ఘాతపురుషః -

చాతుర్మాస్యమితి ప్రోక్తం యత్త్వయా పూర్వకశ్చ యే ।
కేన ప్రకాశితం సర్వం కిముద్దిశ్య సమాచరేత్ ॥ 25

కిం ఫలం కా గతిర్మేఽద్య తత్సర్వం వక్తు మర్హసి ।

ఓ యంగీరస మహర్షీ! చాతుర్మాస్య వ్రతమన నేమి? దాని నే యుద్దేశ ముతో నాచరింతురు? ఇదివరకెవరైన నీ వ్రతమాచరించిన వారు కలరా? దాని ఫలితమేమి? విధానమెట్టిది? నాకు విస్తరించి చెప్పుడని ప్రార్థించెను.

అంగీరసః :-

బంధుర్భవాన్మనుష్యాణాం యత్పృష్టం తత్సుఖప్రదమ్ ॥ 26

తత్సర్వం తేఽభిధాస్యామి సావధానమనాశ్శృణు।
ఆషాఢే పూర్వపక్షస్య దశమ్యాం చ జనార్దనః ॥ 27

శేతే స సుప్తివ్యాజేన శ్రియా సాకం పయోనిధౌ।
కార్తికే శుక్లపక్షే స్యాద్ద్వాదశీ హరిబోధినీ ॥ 28

చాతుర్మాస్యమితి ప్రోక్తం విష్ణుసుప్తిసుఖప్రదమ్ ।
సత్యం ధ్యాయతి తన్మధ్యే స వై యాతి పదం విభోః ॥ 29

విష్ణుసుప్తిప్రదే యస్మిన్ పుణ్యే మాసచతుష్టయే ।
యద్యదాచరతే యస్తు తత్సర్వం సఫలం భవేత్ ॥ 30

కారణం చాత్ర వక్ష్యామి పురా మే హరిణోదితమ్ ।

అంత అంగిరసుడు, ఓ విప్రోత్తమా! నీవు సకల జనోపకారంబగు నుత్తమ ప్రశ్న నడిగితివి. కావున చెప్పుచున్నాను.చాతుర్మాస్యవ్రతమనగా నాలుగు మాసములు దీక్షతో నుండి చేయువ్రతము, అదెప్పుడందువా, శ్రీమహా విష్ణువు

లక్ష్మితోకూడి ఆషాఢశుద్ధఏకాదశీ దివసమున పాలసముద్రము నందాదిశేషుని శరీరముమీద శయనించి, కార్తిక శుద్ధ ఏకాదశినాడు నిద్ర నుండి లేచును. ఆ నాలుగు మాసములకే చాతుర్మాస్య మనిపేరు. ఆ నాలుగు మాసములలో శ్రీహరిప్రీతికై స్నాన ధ్యాన మంత్ర జపములు మొదలగు నేసత్కార్యముల నొరించినను అవి పూర్ణఫలము నిచ్చునవి యగును. నేనిందులకు శ్రీమన్నారాయణుని వలన వినిన కారణమును చెప్పెదను.

పురా కృతయుగే పుణ్యే వైకుంఠే విష్ణుమందిరే ॥ 31

సేవ్యమానస్సురగణైః కిన్నరోరగఖేచరైః ।
వామాంకస్థితయా లక్ష్మ్యా సార్ధం పంచముఖాసనే ॥ 32

ఉపవిష్టస్సేవ్యమాన స్స్వభృత్యైస్స్వగణైర్వరైః ।
ఇతిస్థితే హరౌ తత్ర నారదో భగవాన్ప్రియః ॥ 33

ఆజగామ హరేర్లోకం కోటిసూర్య ప్రభాన్వితమ్ ।
తత్ర సింహాసనాసీనం చతుర్బాహుం మనోరమమ్ ॥ 34

సాధు పద్మపలాశాక్షం నారదస్స వ్యలోకయత్ ।
ననామ పాదయోస్తస్య జాతహర్షాన్వితో మునిః ॥ 35

హరిర్దేవఋషిం దృష్ట్వా నారదం పార్శ్వవాసినమ్ ।
విహసన్ వాక్యమాహేదన్న జానన్నివ కేశవః ॥ 36

తొల్లి కృతయుగంబున విష్ణులోకమున గరుడగంధర్వాది దేవతలచేత, దేవమునులచేత సేవింపబడు శ్రీహరి లక్ష్మీసహితుడై సింహాసనమున గూరుచుండి యుండగా నటకు నారదుండరుదెంచి పద్మనేత్రుండును చతుర్బాహుండును కోటిసూర్యప్రభాభాసమానుండునగు శ్రీహరికి సాష్టాంగనమస్కార మొనరించి చేతులు జోడించి నిండు సంతోషమున నుండెను. అంత శ్రీమహావిష్ణువు నారదునిజూచి చిరునవ్వు నవ్వుచు నేమియు నెరుంగనివాని భంగి నిట్లనియె.

భగవాన్:

కుశలం తవ విప్రేన్ద్ర యత్ర యత్ర గమిష్యసి ।
ఋషీణాం సర్వకర్మాణి కిన్ను సాధూని నారద! । 37

సర్వోపద్రవహీనాని విహితాని మనీషిణామ్ ।
మానవాస్సర్వధర్మేషు నియుక్తాస్తే పృథక్పృథక్ ॥ 38

తత్సర్వం వద దేవర్షే! సదస్యస్మిన్మునీశ్వర! ।

ఓ నారదా! నీకు సేమమా? నీవు చూచిన మహామునుల సత్కర్మానుష్ఠానములు విఘ్నములు లేకుండా సాగుచున్నవా? మానవులందరు వారి వారికి విధింపబడిన ధర్మములను తప్పక నిర్వహించుచుండిరా? ఏ విధమైన నుపద్రవంబులు నేరికిని లేవుగదా? ఇదంతయు నిండుసభలో విశదముగా వక్కాణింపుమనెను.

నారదః:

ఇత్థం హరేర్ముకుందస్య వచశ్శ్రుత్వా స నారదః ॥ 39

హరిమాహప్రసన్నాత్మా విహసన్విశ్వమంగళమ్ ।
హరే దృష్టం మయా భూమౌ యైర్విముక్తః త్రయీపథః ॥ 40

భగవన్మనయో వాఽపి కేచిన్మానవసంగతాః ।
సువిస్మృత్యోదితం కర్మముక్తాస్స్యుః కేన తే ప్రభో ॥ 41

అభక్ష్యభక్షణరతాః కేచిత్త్య క్తవ్రతాః పరే ।
కేచిదాచారసమ్పన్నాః తథాఽహంకారవర్జితాః ॥ 42

కేచిత్సన్మార్గనిరతాః కేచిన్నిందాపరాయణాః ।
తస్మాత్తాన్పాలయస్వ త్వం భగవన్మునిమండలమ్ ॥ 43

కురు శిక్షాముపాయేన దేవదేవ సుకర్మణా ।

ఇట్లు మహావిష్ణువుయొక్క మాటలను విని నారదుడు చిరునవ్వుతో

నిట్లనెను:- ఓ దేవదేవా! నీ వెరుంగని దీజగంబున నేదికలదు? ఐనను, నన్ను వచింపుమనుటచేత చెప్పుచుంటిని. ప్రపంచమున కొందఱు మునులు, మనుష్యులుగూడా స్వవిహితకర్మములను మరచి చేయుట లేదు. వారెట్లు ముక్తులగుదురో ఎఱుంగ లేకున్నాను. కొందఱు భుజింపరాని పదార్థములను భుజించుచున్నారు. కొందఱు వ్రతారంభముచేసి పూర్తిచేయక విడుచుచున్నారు. కొందరు సదాచారులుగాను, మరికొందరు అహంకార రహితులుగను, వేరుకొందరు పరనిందా పరాయణులుగను ఉన్నారు. వారలను సత్కర్మలవలన సుకృతాత్ములనుగా నొనర్చి రక్షింపుమనెను.

శ్రుత్వా దేవఋషేర్వాక్యం భగవాన్భక్తవత్సలః ॥ 44

పాలకస్సర్వలోకానామేక ఏవ జనార్దనః ।
హరిః ఖగేంద్రమారుహ్య స లక్ష్మ్యా భువమాగమత్ ॥ 45

యత్ర సాహస్రసంఖ్యాకం మునీనాం మండలం విభుః ।
వృద్ధబ్రాహ్మణరూపేణ సంచరన్సర్వమేదినీమ్ ॥ 46

అంత జగన్నాటక సూత్రధారుడును, నిఖిలజగదాధారుడునైన దామోదరుడు తత్క్షణము లక్ష్మీదేవితో గూడ గరుడు నెక్కి వేలకొలది మహర్షులున్న తావుగల భూలోకమునకు విచ్చేసి ముసలి బ్రాహ్మణరూపముతో తిరుగాడుచుండెను.

సర్వజంతుహృదిస్థోఽపి మాయానాటకవిగ్రహః ।
యత్ర యత్ర సుపుణ్యేషు క్షేత్రతీర్థగిరిష్వపి॥ 47

విపినేష్వపి పుణ్యేషు ఆశ్రమేషు విశేషతః ।
దృష్ట్వా కేచిద్ద్విజవరా మానవా భక్తితత్పరాః ॥ 48

అతిథ్యం చక్రిరే కేచిత్కేచిత్తం జహసుః ప్రజాః ।
న నమంతి తథా కేచిత్కేచిన్మానవశం గతాః ॥ 49

కేచిద్గర్వవశం ప్రాప్తా కామాంధాస్తత్ర కేచన ।
కేచిత్తత్తత్క్రియాలోకాః కేచిదేకవ్రతాః వరే ॥ 50

కేచిత్తత్ర నిషిద్ధేషు దినేష్వన్నపరాయణాః ।
హరివాసరవిభ్రష్టాస్తథాఽఽఽజ్యేష్వపి చ ప్రియాః ॥ 51

కేచిదాచారసంపన్నాః కేచిదాత్మని పాలసాః ।
తాన్దృష్ట్వా భగవాన్ విష్ణుర్ద్విజరూపీ జనార్దనః ॥ 52

ఉపాయం చిన్తయన్నాగాత్స పునర్మునిమండలమ్ ।
నైమిశం సుమహారణ్యం పుణ్యం మునివరప్రియమ్ ॥ 53

ఆ మాయామేయ రూపుడగు శ్రీమన్నారాయణుడఖిల జనహృత్పద్మముల నున్నవాడైనను, వారివారికి గల భక్తిని పరీక్షింప దలంచి భూలోకమందలి పుణ్య క్షేత్ర పుణ్యనగ పుణ్యాశ్రమ పుణ్యవనంబులందు వృద్ధబ్రాహ్మణ రూపుడై సంచరించుచుండెను. ఆరీతిగ తిరుగాడు నా భగవానునికి కొందరతిభక్తితో నతిథి పూజ లొనర్చిరి. వేరుకొందరు వృద్ధుడని తలంచి ఎగతాళిజేసిరి. మరికొందరీముసలి బక్కబాపనయ్యతో మనమేల ప్రసంగించవలయునని గర్వపడిరి. వేరుకొందరు కామాంధకారమున నతనిని తేరిచూడరైరి. మరి కొందరు తమ వ్యాపారముల జూచుకొనుచు నతని పదభక్తి నెత్తరైరి. కొందరు వ్రతదీక్షతో నుండిరి. కొందరు నిషిద్ధ దినములందు గూడ భుజించుచుండిరి. ఇక కొందరు హరివాసరమును (ఏకాదశి) త్యజించిరి. వేరుకొందరు సదాచార సంపన్నులుగను, మరికొందరు సదాచార వర్జితులుగను నుండిరి. శ్రీహరి ఇట్టి వారి నందరిని గాంచి వీరినెట్లు తరింపజేతునా యని యాలోచించుచు నావృద్ధ బ్రాహ్మణ రూపంబును విసర్జించి, శంఖచక్రగదా పద్మకౌస్తుభ వనమాలాద్యలం కృతుడై లక్ష్మీదేవితోడను, తన భక్తులతోడను మునిజన ప్రీతికరంబగు నైమిశారణ్యంబున కరిగెను.

హిత్వా ద్విజవరం రూపం పూర్వవత్ఖగవాహనః ।
కౌస్తుభాభరణశ్శ్రీమచ్ఛంఖచక్రవిరాజితః ॥ 54

సాకం స్వభక్తనికరైస్సభార్యో జగదీశ్వరః ।
ఏవం జగన్మయం దృష్ట్వా జ్ఞానసిద్ధాదయో ఽమలాః ॥ 55

సశిష్యాస్ససుతాః పుణ్యాస్సర్వే విస్మితమానసాః ।
విష్ణుం వైకుంఠనిలయం స్వాశ్రమేష్వాగతం హరిమ్ ॥ 56

అతసీపుష్పసంకాశం విద్యుద్వర్ణపటావృతమ్ ।
కోటిసూర్యప్రభాభానం స్ఫురన్మకరకుండలమ్ ॥ 57

అనేకరత్నసంయుక్త కిరీటేన విరాజితమ్ ।
అనేకాదిత్యసంకాశమమేయమమరేశ్వరమ్ ॥ 58

స్వయం ప్రసన్న మధ్యక్షమాద్యం దృష్ట్వా మునీశ్వరాః ।
జ్ఞానసిద్ధాదయస్సర్వే మునయస్సంశితవ్రతాః ॥ 59

హరేస్సమీపమాజగ్ముస్సర్వే జాతసుబుద్ధయః ।
ప్రణామం చక్రురనఘాః పాదయోః పరమాత్మనః ॥ 60

జ్ఞానసిద్ధాదయస్సర్వే మునయః ప్రాంజలిస్థితాః ।
తుష్టువుస్తత్ర సంతుష్టాస్సర్వజ్ఞం జగదీశ్వరమ్ ॥ 61

ఆసనము నందున్న జ్ఞానసిద్ధాది మునిపుంగవులు, స్వయముగా తమ ఆశ్రమంబున కనుగ్రహింప వచ్చిన అవిసెపూవు కాంతివంటి కాంతిగలిగి, పీతాంబరధారుడై, కోటిసూర్య ప్రభాభాసమానుడై, రత్నకిరీట కుండల కేయూర హారాదుల నలంకరించుకొన్నవాడును, దేవదేవుండును, సుప్రసన్నహృదయుండును, సచ్చిదానంద రూపుడైన శ్రీమన్నారాయణుని దర్శించి పుత్రమిత్ర శిష్యులతో గూడ భక్తియుక్తముగా సాష్టాంగ నమస్కార మాచరించి దోసిలొగ్గి సర్వజ్ఞ భగవానుని స్తుతించిరి.

ద్వితీయాధ్యాయము సమాప్తము



# తృతీయాధ్యాయము

## విష్ణుమూర్తి వరము

జ్ఞానసిద్ధి:-

విదురధికవిధిజ్ఞా వేదవేద్యం సుగుహ్యాం
నిగమహృదయవాసం నిశ్చలం చాద్వితీయమ్ ।
హిమకరరవిశర్వబ్రహ్మముఖ్యైర్నరేంద్రైః
స్తుతచరణయుగం త్వాం నౌమి భూయస్సురమ్యమ్ ॥ 1

భవాన్న వాచాం విషయోఽపి నిత్యంభవార్చితాంఘ్రిర్భవతీతి హంత!।
భవార్ణవస్థైస్సతతం భవాద్యైః స్తుత్యో భవద్బాధరభూతరూపైః ॥ 2

భూతాని భూతాని తథైవ సన్తిభవ్యాని సర్వాణి చరాచరాణి ।
భవద్విభూతిః పరమా పరస్మాత్పరో భవానీపతిపూజితాంఘ్రిః ॥ 3

త్వమీశ్వరో యన్నిఖిలం విభాతి మాయామయం స్రక్ఫణికల్పమీశ।
చరాచరం విశ్వమనేకబీజం భూతైర్మహద్భిస్సహ మాయయాచ ॥ 4

ఆదౌ తథాంతే చ భవాన్ సమగ్రం విశ్వావతస్థో భవసీహ మధ్యే ।
అన్నస్య యజ్ఞస్య చ తమ్మరారే చతుర్విధస్యాపి విచిత్రరూప ॥ 5

సుప్త్వా త్వదీయం పరమం సుఖం తు సంజీవ్య సచ్చిత్సుఖరూపమేతత్ ।
ప్రతీయతే యద్వదిదం జగచ్చ సుచన్ద్రికాయాం తు హరే పయోబ్ధిః ॥

ఆనందవారాన్నిధిరీశ్వరత్వం త్వమేవ తద్వచ్చితి సర్వతోఽపి ।
సర్వాకరం సర్వపురాణసారంత్వత్తస్సమస్తం త్వయి లీయతే చ ॥7

ఆత్మా జనానాం హృదయాంబుజన్యస్సాక్షాత్త్వమీశోఽఖిలలోకవంద్యః ।
ద్రష్టుం న శక్యో మనసా పిఽయద్యన్న దృశ్యసే మాంసదృశాం త్వమత్ర॥

నమో నమస్తే శివ!తే నమోஉస్తునారాయణ స్త్వం కురు మాం కృతార్థమ్ ।
త్వద్దర్శనం మా విఫలం మమాస్తు నమో మురారే! పురుషాయ తుభ్యమ్ ॥

త్వం మాం సదా పాహి సురేశ్వరస్త్వంనమశ్చరేశాఖిలలోకవంద్య! ।
ఏవం కృతేஉహం చ కృతః కృతార్థోన తేஉపి కించిత్పరియాతి నాశమ్ ॥ 10

కృపా నిదానం తు భవాన్ స వన్ద్య శ్చైచ్యస్తథాஉహం చ భవార్ణవస్థః॥
సంశుద్ధ పాహీశ్వర! లోకవన్ద్య!సంసారసిన్ధౌ పతితం మురారే ॥ 11

నమస్త్రై_లోక్యనాథాయ నమస్త్రై_లోకవాసినే ।
అనంతాయాదిబీజాయ విష్ణవే వేధసే నమః ॥ 12

హంసాయ హంసపతయే నమః పూర్ణసదాత్మనే ।
గుణాతిగాయ గురవే నమస్తే కరుణానిధే! ॥ 13

నిత్యానందసుధాబ్ధి వారినిధయే స్వర్గాపవర్గాప్తయే
నానాభేదవివర్జితాయ సుతరాం తేజఃస్వరూపాయ చ ।
సాధుష్వబ్ధిగహృత్సరోరుహదళేష్వన్తస్థితాయాత్మనే
గోవిందాయ సురేశ్వరాయ హరయే కృష్ణాయ తుభ్యం నమః ॥14

విశ్వోత్పత్తి విపత్తిగుప్తిపతయే వైకుంఠవాసాయ తే
వ్యాసాద్యైర్నుత పాదపద్మవిబుధై రానమ్రవాక్కంధరైః ।
స్తుత్వా తే పదభక్తినావమధికం త్వారుహ్య జన్మార్ణవం ।
తీర్త్వా త్వాం నమమాపురార్తిహరణం తేజోమయం తే హరే ॥ 15

నానాబోధసుతర్కవాక్యనిచయైర్నానాపురాణాగమైః
నానాశాస్త్రవిచారనీతిసహితైర్న త్వాం విదుర్మానవాః ।
త్వద్భక్త్యా చ నిరంజనద్యుతిబలాత్త్వత్పాదపద్మం హరే
పశ్యన్త్యాత్మ విశేషమేవ సతతం త్వద్భక్తితశ్చోత్తమమ్ ॥ 16

ఆ నైమిశారణ్యమునందున్న మునులలో నెల్ల నన్నివిధంబులచేతను పెద్దవాడైన జ్ఞానసిద్ధుడు, ఓ పుండరీకాక్షా! వేదవేత్తలు నిన్ను వేదవేద్యుడని,

వేదవ్యాసుడని, అద్వితీయుడని, సూర్యచన్ద్ర నేత్రుడని వచింతురు. బ్రహ్మ రుద్రేంద్రాదులు స్తుతింపదగిన నీ పాదపద్మంబుల కిదే వందనంబు. అవాచ్యుడవైన నీవు అవాఙ్మానస గోచరుండవు. సంసారభయ పరిహారకుండవు. బ్రహ్మాది స్థావరాంతముగల ప్రాణికోట్లు నీవిభూతియేగాని అన్యము గాదు. అందుచే నిన్ను పరాత్పరుడని స్తుతింతురు. ఓ ప్రభూ! నీవీ పదునాల్గు లోకముల నుత్పత్తి లయములను చేయువాడవు. ఓ చిదానందరూపా! నీవు సర్వాన్తర్యామివై యుండి జఠరాగ్నిరూపమున జనులచే తినబడిన చతుర్విధాన్న మును పచనము గావించి దేహములకు బలమొసంగువాడవు. ఓ పరతత్త్వ రూపా! నీకివే వేయి వందనములు. ఓ పురాణపురుషా! ఓ మురారే! ఓ మాధవా! నీదర్శనము నిష్ఫలము గారాదు. నన్ను కృతార్థుని జేయుము. నీవు దయార్ద్రహృద యుండవు. నే నీ సంసారపంకిలమున బడి లేవలేకుంటిని. నన్నుద్ధరింపుమా! చతుర్దశ భువనాధారా! లోకరక్షకా! నీకివే వేలకొలది వందన ములు. సకల జగన్నివాసుడవు. సకల జగదుత్పత్తి లయకారణుడవు, వ్యాసాది మునిపుంగ వార్చితుండవు, అచ్యుతుడవు, వైకుంఠవాసుడవు నగు నీకిదే నమస్కారము. నిన్ను భజించిన వారు నీపాదంబులను నావనెక్కి సంసార సాగరమును తరించుచున్నారు. మానవులెన్ని పురాణముల జదివినను, ఎన్ని శాస్త్రచర్చలు గావించినను నిన్నుజూడజాలరు. నీ భక్తులకు మాత్రమే నీవు దృగ్గోచరుండవు.

హస్తీంద్రధ్రువపాలకాయ విభవే ప్రహ్లాదసంరక్షిణే
మార్కండేయవిభీషణోద్ధవపరిత్రాత్రే యశస్సంపదే ।
త్వన్నామగ్రహణేన పాతకచయం తూర్ణం చ నశ్యత్యహో
దిష్ట్యా యస్సకృదేవ త్వత్పదయుగం ప్రాప్నోతి తుభ్యం నమః ॥

కేశవాయ నమస్తేఽస్తు నమో నారాయణాయ చ ।
గోవిందాయ నమస్తే స్తు మాధవాయ చ విష్ణవే॥ 18

మధుసూదన దేవాయ మహేశాయ మహామతే ।
త్రివిక్రమాయ నిత్యాయ వామనాయ నమోఽస్తుతే ॥ 19

శ్రీధరాయ నమస్తేఽస్తు హృషీకేశాయ తే నమః ।
నమస్తే పద్మనాభాయ నమో దామోదరాయ చ ॥ 20
సంకర్షణ నమస్తుభ్యం పాహ్యస్మాన్కరుణానిధే ।

ఓ గజేంద్రరక్షకా! ప్రహ్లాదవరదా! ధ్రువసంరక్షకా! మార్కండేయ విభీషణాది భక్తరక్షకా! ఏమానవుం డొక్కపరి నీపాదపద్మంబులను సేవించునో వాడు సర్వపాతకనాశము నొందిన వాడగును. ఓ కేశవా! నమస్కారము, నారాయణా! నమస్కారము, మాధవా! నమస్కారము, గోవిందా! నమస్కారము, విష్ణో! నమస్కారము, మధుసూదనా! నమస్కారము, త్రివిక్రమా! నమస్కారము, వామనా! నమస్కారము, శ్రీధరా! నమస్కారము, హృషీకేశా! నమస్కారము, వాసుదేవా! నమస్కారము, ప్రద్యుమ్నా! నమస్కారము, పురుషోత్తమా! నమస్కారము, అధోక్షజా! నమస్కారము, నారసింహా! నమస్కారము, అచ్యుతా! నమస్కారము, జనార్దనా! నమస్కారము, ఉపేన్ద్రా! నమస్కారము, ఓ హరే! నమస్కారము, ఓ కరుణానిధీ! మమ్ము కాపాడుము అని స్తుతియించెను.

స్తువన్తమిత్థం భగవాన్ జ్ఞానసిద్ధిమువాచ హ ॥
ఈషత్స్మితాబ్జవదనో విష్ణుర్వైకుంఠవల్లభః । 21

శ్రీభగవాన్:-

తుష్టోఽహం జ్ఞానసిద్ధేఽద్య వరం వరయ సువ్రత! ॥ 22
త్వయా కృతేన స్తోత్రేణ ప్రసన్నం చ మనో మమ ।

అట్లు స్తుతించిన జ్ఞానసిద్ధిని జూచి శ్రీహరి యించుక చిరునవ్వుతో నిట్లనెను. ఓ జ్ఞానసిద్ధీ! నీ స్తోత్రవచనముల కేనెంతయు నలరితిని. ఏదేని వరము నీయిచ్ఛ వచ్చినది కోరుకొమ్మనెను.

ఋషిః :-

త్వత్పదం దేహి గోవింద! కృపా చేదస్తి తే మయి ॥ 23
న కాంక్షయేఽహమధికమితోఽన్యం వరముత్తమమ్ ।

అంత నాజ్ఞానసిద్ధి, పరమాత్మస్వరూపుడా! నాకు సర్వదా నీపాదపద్మము లందే మనసుండునట్టు ననుగ్రహింపుము. అన్యమేదియైనను నాకక్కరలే దనెను.

శ్రీభగవాన్:-

తథా భవిష్యతి మునే! శృణు చాన్యం సుఖప్రదమ్ ॥ 24

లోకే కేచిద్దురాచారమాశ్రయంత్యస్తబుద్ధయః ।
కల్పయేఽహం వ్రతం తేషాం శ్రుత్యుక్తమఘహారకమ్ ॥ 25

శృణ్వంత్వత్ర స్థితాస్సర్వే వాక్యం మే భూతశంకరమ్ ।
అహమాషాఢమాసస్య దశమ్యాం శుక్లపక్షకే ॥ 26

నిద్రాం కరోమి విప్రేంద్ర! లక్ష్మ్యా సహ పయోనిధౌ ।
ఉద్బుధ్యే ఽహం తథైవోర్జే శుక్లద్వాదశవాసరే ॥ 27

మమ సుప్తిప్రదే పుణ్యే భూమ్యాం మాసి చతుష్టయే ।
యస్తు వ్రతాది దానైశ్చ యశ్శక్త్యా మాముపాసతే ॥ 28

తేషాం పాపాని నశ్యంతి సన్నిధిర్మే భవేచ్చిరమ్ ।
న కుర్యాద్యది యో లోకే వ్రతం మాసచతుష్టయమ్ ॥ 29

మత్సుప్తికారణే పుణ్యే న యాతి నిరయాలయమ్ ।
కుర్వన్తు మునయస్సర్వే లోకే మద్భక్తిమాశ్రితాః ॥ 30

మదాజ్ఞయా మునిశ్రేష్ఠాః వ్రతమిష్టార్థదాయకమ్ ।
న కరోతి యదా మూఢశ్చాతుర్మాస్యవ్రతం శుభమ్ ॥ 31

బ్రహ్మఘ్నగతిమాప్నోతి కిమన్యైర్బహుభాషణైః ।
నిద్రాలస్యజడాద్యైశ్చ దుఃఖజన్మజరాదిభిః ॥ 32

లాభాలాభై స్తథాఽ న్యైశ్చ న చాస్తి మమ తైర్భయమ్ ।
యే మద్భక్తి పరాలోకే యే వై సద్ధర్మవర్జితాః ॥ 33

తేషాం భక్తిపరీక్షార్థం సుప్తివ్యాజముపాశ్రయే ।
విహితాం యే మమాజ్ఞాం చ యే కుర్వన్తి మమ ప్రియమ్ ॥ 34

తేషాం పాపాని నశ్యన్తి మనోవాక్కాయజాని చ ।
స్తోత్రం యః పఠతే పుణ్యమిదం సంధ్యాత్రయే నరః ॥ 35

మద్భక్తిరచలా చాస్తు స వైకుంఠే చిరం వసేత్ ।
ఇత్యుక్త్వా భగవాన్ కృష్ణః స లక్ష్మ్యా క్షీరసాగరమ్ ॥ 36

ఆషాఢస్య దశమ్యాం తు శుక్లాయాం ప్రయయౌ హరిః ।
శేతే సుధానిధౌ విష్ణుః ఫణితల్పే సుఖప్రదే ॥ 37

అంత నాజగద్రక్షకుడు ఓ జ్ఞానసిద్ధీ! నీవు కోరిన వరమిచ్చితిని. వేరొకటి చెప్పెద. వినుము. లోకమునందు చాలమంది దురాచారులై బుద్ధిహీనులై యున్నారు. వారి పాపములు పాయుట కొక వ్రతము కల్పించెదను. అది సర్వజన సుఖకరము. సుకరము, నేనాషాఢశుద్ధదశమి నాడు లక్ష్మీదేవితోగూడ శేషశయ్యపై క్షీరసాగరమున సుఖనిద్రకై పరుండుదును. తిరిగి కార్తిక శుద్ధద్వాదశినాడు సుఖ నిద్రనుండి లేచి క్షీరసాగరమును విడుతును. ఆ నాలుగుమాసముల కాలములో నాకిష్టమైన చాతుర్మాస్యవ్రతము నొనరించు వారికి నిఖిల పాపములు నశించి మత్సాయుజ్యము లభించును. ఆకాలమందా వ్రతమును చేయనివాడు నరకకూపమున బడును. మీరందరా వ్రతమును ఆచరింపుడు. ఇతరులచే నాచరింపజేయుడు. ఆ వ్రతము నాకాలములో జేయనివాడు బ్రహ్మజ్ఞానమునకు దూరుడగును. చేసిన వారికి జన్మజరా వ్యాధులవలన బాధ లుండవు. నాయందు భక్తిగలవారిని, లేనివారిని పరీక్షించు టకు నిద్రావ్యాజముననేనిట్లు శయనింతును. ఇప్పుడు నీవొనరించిన స్తోత్రమును త్రిసంధ్యలందు పఠించిన వారు నా సన్నిధి నుందురు. విష్ణు భగవానుడట్లు మునుల కాదేశించి శ్రీదేవితో గూడ నాషాఢశుక్లపక్ష మందలి దశమినాడు పాలసంద్రమున్ఁకేగి శేషశయనముపై పవ్వళించెను.

విష్ణువాక్యమిదం పుణ్యం కథితం తే మహామతే! ।
సర్వవ్రతోత్తమం పుణ్యం చాతుర్మాస్యం ఫలప్రదమ్ ॥ 38

పాపీయాంసో దురాత్మానస్సాధవో వా హరిప్రియాః ।
వ్రతం సమాచరేత్సమ్యక్ప్రాప్తే మాసచతుష్టయే ॥ 39

బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాశ్శూద్రాశ్చాపి తథా పరే ।
పత్న్యయః స్త్రీ జనాస్సర్వే వ్రతస్థా విష్ణుతుష్టయే ॥ 40

అభర్త్రా వా సభర్త్రా వా తథా కాషాయధారకః ।
ఆవశ్యకమిదం భద్రం వ్రతం సమ్యక్సమాచరేత్ ॥ 41

నాచరేద్యది యో మోహాత్తదా దేవవ్రతం శుభమ్ ।
బ్రహ్మఘ్నగతిమాప్నోతి శుచిత్వం నైవ విద్యతే ॥ 42

మనోవాక్కాయశుద్ధేన సపర్యాం విష్ణవేఽన్వహమ్ ।
యః కరోతి స ధన్యోఽభూత్సుప్తే దేవే జనార్దనే ॥ 43

యో న కుర్యాద్వ్రతం పుణ్యం విష్ణోస్సుప్తిసుఖప్రదమ్ ।
సురాపగతిమాప్నోతి కోటిజన్మస్వసంశయః ॥ 44

చాతుర్మాస్యవ్రతం పుణ్యం తుష్టయే పరమాత్మనః ।
న కుర్యాద్యది వా మోహాత్స గోఘ్నస్య గతిం లభేత్ ॥ 45

వ్రతం సమాచరేన్నిత్యం యేన కేనాపి మానవః ।
సోఽపి క్రతుశతం పుణ్యం ప్రాప్య పశ్చాద్ధరిం వ్రజేత్ ॥ 46

ఇత్యాకర్ణ్య హరేర్వాక్యం చాతుర్మాస్యవ్రతం శుభమ్ ।
జ్ఞానసిద్ధాదయస్సర్వే కృత్వా విష్ణుపదం యయుః ॥ 47

ఓ జనకరాజేంద్రా! శ్రీహరి యానతిచ్చిన చాతుర్మాస్యవ్రతమును నీ కెరిగించితిని అని వసిష్ఠమహర్షి వచించెను. అంగీరసుడు విత్తపునకు నిట్లు చెప్పెను. ఈ వ్రతము నాచరించుటకు స్త్రీ పురుష భేదముగాని, శిష్ట దుష్ట భేదముగాని లేదు. నాలుగు వర్ణములలో నెవరైనను జేయవచ్చును. సువాసిని,

వితంతువు, యోగిని ఆదిగా నెవ రాచరించినను భగవత్ప్రీతికరమే యగును. ఈ వ్రతమాచరించినవాడు విష్ణు సాయుజ్యమును పొందును. శక్తి యుండియు చేయనివాడు గోహత్య, స్త్రీ హత్య, శిశుహత్య, బ్రాహ్మణ హత్యలను చేసిన పాపునికంటె నెక్కుడు పాపియగును. జ్ఞానసిద్ధాదు లీ వ్రతమాచరించి ధన్యులై వైకుంఠమున నున్నవారు.

తృతీయాధ్యాయము సమాప్తము



# చతుర్థాధ్యాయము

## నారదుని పూర్వజన్మ వృత్తాంతము

### శ్రీమద్భాగవతము-ప్రథమస్కంధము

మహాత్మా! నేను పూర్వకల్పంబున దొల్లిటి జన్మంబున వేదవాదుల యింటి దాసికింబుట్టి పిన్ననాడు వారలచే బనుపంబడి యొక్క వాన కాలంబున జాతుర్మాస్యంబున నేకస్థలనివాసంబు సేయ నిశ్చయించిన యోగి జనులకుం బరిచర్య సేయుచోట.

**ఓటమితో నెల్లప్పుడు బాటవమున బనులు సేసి బాలురకడ కే**
**యాటలకు బోక యొక జంజాటంబును లేక భక్తి సలుపుదు ననఘా.**

**మంగళ మనుచును వారల యెంగిలి భక్షింతు వానకెండకునోడన్**
**ముంగలనిలుతును నియతినివెంగలిక్రియ జనుదు నురువివేకము తోడన్.**

ఇట్లు నేను వర్షాకాల శరత్కాలంబులు సేవించితి. వారును నా యందు గృపసేసిరంత

**వారల్ కృష్ణచరిత్రముల్ సదువగా వర్ణింపగా బాడగా**
**నారావంబు సుధారస ప్రతిమమై యశ్రాంతమున్ వీనులం**

దోరంబై పరిపూర్ణమైన మది సంతోషించి నేనంతటం
బ్రారంభించితి విష్ణుసేవ కితర ప్రారంభ దూరుండనై.

ఇట్లు హరిసేవారతింజేసి ప్రపంచాతీతుండనై బ్రహ్మరూపకుండ నయిన నాయందు స్థూల సూక్ష్మం బయిన ఈ శరీరంబు నిజమాయా కల్పితం బని యమ్మహాత్ములగు యోగిజనుల మూలంబున రజస్తమోగుణ పరిహారిణి యయిన భక్తి సంభవించె నంత జాతుర్మాస్యంబు నిండిన నయ్యోగిజనులు యాత్రసేయువారలై రివ్విధంబున

అపచారంబులు లేక నిత్యపరిచర్యాసక్తి యుక్తుండనై
చపలత్వంబును మాని నే గొలువగా సంప్రీతులై వారు ని
ష్కపటత్వంబున దీనవత్సలతతో గారుణ్య సంయుక్తులై
యుపదేశించిరి నాకు నీశ్వర రహస్యోదార విజ్ఞానమున్.

ఏనును వారి యుపదేశంబున వాసుదేవుని మాయానుభావంబు దెలిసితి నీశ్వరునియందు సమర్పితంబయిన కర్మంబు దాపత్రయంబు మానుప నౌషధంబగు నే ద్రవ్యంబువలన నేరోగంబు జనియించె నా ద్రవ్యంబా రోగంబు మానుపనేరదు. ద్రవ్యాంతరంబుల చేతనైన చికిత్స మానుపనోవు నవ్విధంబున గర్మంబులు సంసార హేతుకంబులయ్యు నీశ్వరార్పితంబులై తామ తమ్ము జెఱచుకొన నోపియుండు, నీశ్వరునియందు జేయంబడు కర్మంబు విజ్ఞాన హేతుకంబై, యీశ్వరసంతోషణంబును, భక్తియోగంబునుం బుట్టించు, నీశ్వర శిక్షం జేసి కర్మంబులు సేయువారలు కృష్ణగుణనామ వర్ణన స్మరణంబులు సేయుదురు. ప్రణవ పూర్వకంబులుగా వాసుదేవప్రద్యుమ్న సంకర్షణానిరుద్ధ మూర్తి నామంబులు నాలుగు భక్తిం బలికి నమస్కారంబుచేసి మంత్ర మూర్తియు మూర్తిశూన్యుండును నయిన యజ్ఞపురుషుం బూజించు పురుషుండు సమ్యగ్దర్శనుండగు.

ఏ నివ్విధమున జేయగదానవకులవైరి నాకు తనయందలి వి
జ్ఞానము నిచ్చెను మదను ష్ఠానము నతడెఱుగు నీవు సలుపుము దీనిన్॥

మునికులములోన మిక్కిలివినుకులు గలవాడవీవు విభుకీర్తులు నీ
వనుకూలత బొగడుము విను జనకులముల దుఃఖమెల్ల శాంతింబొందన్ ॥

ఇట్లు నారదు జన్మకర్మంబులు విని క్రమ్మఱ వ్యాసుండిట్లనియె.

వినుమా భిక్షులు నీకు నిట్లు కరుణన్ విజ్ఞానముం జెప్పి పో
యిన బాల్యంబున వృద్ధభావమున నీ కేరీతి సంచారముల్
సనె నీకిప్పుడు పూర్వకల్పమతి యేజాడం బ్రదీపించె ద
త్తనువుం బాసినచంద మెట్లు చెపుమా దాసీసుతత్వంబుతోన్.

అని యిట్లు వ్యాసుం డడిగిన నారదుం డిట్లనియె. దాసీపుత్రుండ నయిన యేను భిక్షులవలన హరిజ్ఞానంబు గలిగియున్నంత.

మమ్ము నేలినవారి మందిరంబున గల
పనులెల్ల గ్రమమున భక్తి జేసి
తన పరాధీనత దలపదు సొలసితి
నలసితి నా కొంటి ననుచు వచ్చి
మాపును రేపును మాతల్లి మోహంబు
సొంపార ముద్దాడు జొంచు దువ్వ
దేహంబు నివురు మోదించు గౌగిట జేర్చు
నర్మిలి నన్నిట్టు లరసి మనుప

నేను విడిచిపోక యింట నుండితి నయ్య
మోహిగాక యెఱుక మోసపోక
మాఱు చింత లేక మౌనినై యేనేండ్ల
వాడనగుచు గొన్ని వాసరములు.

సదనము వెలువడి తెరువున జెదరక మాతల్లి రాత్రి జీకటివేళన్
మొదవుం బిదుకగనొకఫణి పదభాగము గఱచె ద్రొక్కబడి మునినాథా!.

నీలాయతభోగఫణ వ్యాళావల విషమహోగ్ర వహ్నిజ్వాలా
మాలా వినిపాతితయై వ్రాలెన్ ననుగన్న తల్లి వసుమతిమీదన్.

తల్లి ధరిత్రిపై నొఱగి తల్లడపాటును జెంది చిత్తముం
బల్లటిలంగ బ్రాణములు వాసిన జూచి కలంగ కేను నా
యుల్లములోన మోహరుచి నొందక సంగము వాసె మేలు రా
జిల్లె నటంచు విష్ణుపదచింత యొనర్పగ బుద్ధి జేర్చుచున్.

ఉత్తరాభిముఖుండనై యేను వెడలి జనపదంబులు బురంబులు బట్టణంబులు గ్రామంబులు బల్లెలు మందలు గిరాతపుళింద నివాసంబులు వనంబులు నుపవనంబులు జిత్రధాతువిచిత్రితంబులయిన పర్వతంబులు నమదకరికరవిదళిత శాఖలు గల శాఖులు ననవరత నివారిత పథికజనశ్రమాతిరేకంబు లయిన తటాకంబులు బహువిధ విహంగ నినద మనోహరంబులై వికచారవింద మధుపానపరవశ పరిభ్రమద్భ్రమర సుందరంబులైన సరోవరంబులు దాటి చనుచు క్షుత్పిపాసా సమేతుండనై యొక్క నదీహ్రదంబున గ్రుంకులిడి శుచినై నీరు ద్రావి గత శ్రముండనై,

సాలావృక కపి భల్లుక కోలేభలులాయ శల్య ఘూక శరభ శా
ర్దూల శశ గవయ ఖడ్గ వ్యాళాజగరాది భయద వనమధ్యమునన్.

దుస్తరంబులైన నీలవేణు కీచక గుల్మలతాగహ్వరంబుల పొంత నొక్క రావిమ్రానిదగ్గఱ గూర్చుండి యే విన్న చందంబున నా హృదయగతుం బరమాత్మ స్వరూపు హరింజింతించితి.

ఆనందాశ్రులు గన్నులన్ వెడల రోమాంచంబుతో దత్పద
ధ్యానారూఢుడనైన నాతలపులో నద్దేవుడుం దోచె నే
నానందాబ్ధి గతుండనై యెఱుగ లేనైతిన్ నమున్నీశ్వరున్
నానాశోకహమైన యత్తనువు గానన్ లేక యట్లంతటన్.

లేచి నిలుచుండి క్రమ్మఱ నద్దేవుని దివ్యాకారంబునుజూడ నిచ్ఛించుచు హృదయంబున నిలుపుకొని యాతురుండునుంబోలె జూచియుంగానలేక నిర్మానుష్యంబైన వనంబునం జరియించుచున్న నన్ను నుద్దేశించి వాగగోచరుడైన హరి గంభీర మధురంబులైన వచనంబున శోకం బుపశమింపం

జేయు చందంబున నిట్లనియె.

ఏల కుమార! శోషిలగ నీ జననంబున నన్ను గానగా
జాలవు నీవు కామముఖషట్కము నిర్దళితంబు జేసి ని
ర్మూలిత కర్ముడైన మునిముఖ్యుడుగాని కుయోగి గానగా
జాలడు నీదు కోర్కి కొనసాగుటకై నిజమూర్తి జూపితిన్.

నావలని కోర్కియూరకపోవదు విడిపించుదోషపుంజములను మ
త్సేవం బుట్టును వైళమభావింపగ నాదుభక్తి బాలక! వింటే

నాయందులమతి గలిగిన వాయదు జన్మాంతరమున బాలక నీ వీ
కాయంబు విడిచి మీదట మాయనుమతి బుట్టగలవు మద్భక్తుడవై!

వినుమీ సృష్టి లయంబు నొంది యుగముల్ వేయైన కాలంబు యా
మినియై పోయెడి బోవగా గలుగు జా మీదం బునస్సృష్టి యం
దు నిరూఢ స్మృతితోడ బుట్టెదవు నిర్దోషుండవై నాకృపన్
ఘనతం జెందెడు శుద్ధసాత్త్వికులలో గణ్యుండవై యర్భకా!

అని యిట్లాకాశంబు మూర్తియు ఋగ్వేదాదికంబు నిశ్వాసంబునుగా నొప్పి సర్వనియామకంబైన మహాభూతంబు పలికి యూరకున్న నేను మస్తకంబు వంచి మ్రొక్కి తత్కరుణకు సంతసించుచు మదంబు దిగనాడి మత్సరంబు విడచి, కామంబు నిర్జించి, క్రోధంబు వర్జించి, లోభమోహంబుల వెడలనడిచి, సిగ్గువిడిచి, యనంతనామంబులు బఠించుచు బరమభద్రంబు లయిన తచ్చరిత్రంబులం జింతించుచు నిరంతరసంతుష్టుడనై కృష్ణుని బుద్ధి నిలిపి భూమిం దిరుగుచు నుండునంతం గొంత కాలంబునకు మెఱుంగు మెఱసిన తెఱంగున మృత్యువు తోచినం బంచ భూతమయంబై గర్మస్వరూపం బయిన పూర్వ దేహంబు విడిచి హరికృపావశంబున శుద్ధసత్త్వంబైన భాగవత దేహంబు సొచ్చితి నంతం ద్రైలోక్యంబు సంహరించి ప్రళయకాల పయోరాశి మధ్యంబున శయనించి నిదురవోవ నిచ్ఛగించు నారాయణమూర్తి యయిన బ్రహ్మనిశ్వాసంబు వెంటన నతని లోపలం ప్రవేశించితి నంత సహస్ర యుగ పరిమితంబైన

కాలంబు సనిన లేచి లోకంబులు సృజియింప నుద్యోగించు బ్రహ్మప్రాణంబు వలన మరీచి ముఖ్యులగు మునులును నేనును జని యించితిమి. నేను బహిరంతరంబు లందు మహావిష్ణుని యనుగ్రహంబున నడ్డంబు లేక యీశ్వర దత్తమై బ్రహ్మాభి వ్యంజకంబులైన సప్తస్వరంబులు దమ యంతన మ్రోగుచున్న ఈ వీణాలాపనరతింజేసి నారాయణ కథా గానంబు సేయుచు జరియించు చుండుదు.

తీర్థపాదుడైన దేవుండు విష్ణుండు తన చరిత్ర మేను దవిలిపాడ
జీరబడ్డవాని చెలువున నేతెంచి ఘనుడు నామనమున గానవచ్చు.

వినుమీ సంసారంబను వననిధిలో మునిగి కర్మవాంఛలచే వే
దన బొందెడివానికి విష్ణుని గుణవర్ణనము తెప్పసుమ్ము మునీంద్రా!

యమనియమాదియోగముల నాత్మ నియంత్రితమయ్యు గామ రో
షముల బ్రచోదితం బయగు శాంతి వహింపదు విష్ణుసేవచే
గ్రమమున శాంతి గైకొనిన కైవడి నాదు శరీరజన్మ క
ర్మముల రహస్యమెల్ల మునిమండన! చెప్పితి నీవు గోరివన్.

అని యిట్లు భగవంతుండగు నారదుండు వ్యాసమునీంద్రుని వీడ్కొని వీణవాయించుచు యదృచ్ఛామార్గంబునం జనియె.

చతుర్థాధ్యాయము సమాప్తము



# పఞ్చమాధ్యాయము

## కార్తిక మాహాత్మ్యసారము

అంగీరస:-

కర్మబంధశ్చ ముక్తిశ్చ కార్యం కారణమేవ చ
స్థూలం సూక్ష్మం తథా ద్వంద్వసంబంధో దేహ ఉచ్యతే ॥ 1

వాక్యార్థప్రవృత్తమేతత్తే ప్రవక్ష్యామి మహామతే ।
పార్వత్యై కథితం విప్ర శ్వేతాద్రౌ శంకరేణ వై ॥ 2

తదహం తే ప్రబ్రవీమి సమాధానమనాశ్శృణు ।
అత్ర బ్రూమస్సమాధానం కోఽన్యో జీవస్త్వమేవ హి ॥ 3

స్వయం పృచ్ఛసి మాం కో ఽహం బ్రహ్మైవాస్మి న సంశయః ।

ఉద్భూత పురుషః :-

వాదార్థమేవం జానామి నాద్యాపి భగవన్ స్ఫుటమ్ ॥ 4
అహంబ్రహ్మేతి వాక్యార్థం ప్రతిపద్యే కథం వద ।

అంగీరస:-

హేతుః పదార్థబోధో హి వాక్యార్థావగతేరపి । 5
అంతఃకరణతద్వృత్తి సాక్షిచైతన్యవిగ్రహః ।
ఆనందరూపస్సత్యస్సన్ కిన్నాత్మానం ప్రపద్యసే ॥ 6
సత్యానందస్వరూపం ధీసాక్షిణం జ్ఞానవిగ్రహమ్ ।
చిన్తయాత్మతయా నిత్యం త్యక్త్వా దేహాదికాం ధియమ్ ॥ 7
రూపాదిమాన్యతః పిండస్తతో నాత్మా ఘటాదివత్ ।
వియదాదిమహాభూత వికారిత్వాచ్చ కుంభవత్ ॥ 8

ఏవమింద్రియదృఙ్నాహం ఇంద్రియాణీతి నిశ్చిను ।
మనో బుద్ధిస్తథా ప్రాణో నాహమిత్యవధారయ ॥ 9

దేహేంద్రియాదయో భావా హానిదాః క్షయభాగినః ।
యస్య సన్నిధిమాత్రేణ సోఽహమిత్యవధారయ ॥ 10

అనాపన్న వికారస్సన్నయస్కాంతవదేవ యః ।
బుద్ధ్యాది శాలయేత్ ప్రత్యక్సోఽహమిత్యవధారయ॥ 11

అజన్మాత్మవదాభాతి యత్సాన్నిధ్యాజ్జడాద్యపి ।
దేహేంద్రియమనః ప్రాణాస్సోఽహమిత్యవధారయ ॥ 12

స్వప్నజాగరితే సుప్తభావే భావో లయం తథా ॥
యో వేత్త్యవిక్రియస్సాక్షీ సోఽహమిత్యవధారయ॥ 13

సర్వజ్ఞుడైన అంగిరసుడు :- ఓ విప్రుడా! నీవడిగిన ప్రశ్నలు కడుంగడు నుత్తమంబులు, వాటికి సమాధానములను చెప్పుచున్నాను. శ్రద్ధతో వినుము.

కర్మవలన నాత్మకు దేహధారణము సంభవించుచున్నది. కావున కర్మ శరీరోత్పత్తికి హేతువగును. శరీరధారణ వలన నాత్మ కర్మను జేయును. అందుచే కర్మ నొనరించుటకు శరీరధారణము హేతువగును. స్థూలసూక్ష్మ శరీరసంబంధమువలన నాత్మకు కర్మబంధము కలుగునని తొల్లి పర మేశ్వరుడు పార్వతీదేవికి జెప్పెను. దానినే నీకు జెప్పుచున్నాను. ఆత్మయన నీ శరీరమున నహంకార త్వంకారముల నారోపించి వ్యవహరించుటయే యని చెప్పెను.

అంత విత్తపుడు, ఓ మునీంద్రా! నేను ఇంతవర కిదియే ఆత్మయని భావించుచుంటినిగాని, నా కది విశదముగా నెఱుంగ రాకున్నది. వాక్యార్థ జ్ఞానమునకు పదార్థజ్ఞానము కారణ మగుచుండును. కనుక అహంబ్రహ్మ యను వాక్యార్థమును నాకు విశదీకరింపుడని యడుగ, నంగిరసు డిట్లనెను. ఈ దేహమునందంతఃకరణ వృత్తికి సాక్షియై 'నేను, నాది' యని వ్యవహరింప బడు జీవాత్మయే అహమ్మను శబ్దార్థము. సర్వాంతర్యామియై సచ్చిదానంద రూపమైన

పరమాత్మ సః అను శబ్దార్థము. ఆత్మకు ఘటాదులవలె శరీరము లేదు. ఆ యాత్మ సచ్చిదానందస్వరూపము, బుద్ధికిసాక్షి, జ్ఞానరూపి, శరీరేంద్రి యములు మొదలగువానిని వ్యాపారములయందు ప్రవర్తింపజేసి వాని కంటె వ్యతిరిక్తముగా నున్నదియై ఎల్లప్పుడు నొకేరీతి ప్రకాశించు చుండునదే ఆత్మ యనంబడును. 'నేను' అనునది శరీరేంద్రియాదులలో నొకటిగాదని ధ్రువ పరచుకొని, ఆ దేహేంద్రియాదుల నన్నింటిని ఏది ప్రకాశింపజేయునో అదియే నేను అను నిశ్చయమును గలిగియుండుము. నామవికార రూపములు గలిగిన ఘటాదులన్నియు నశించును. అందుచే నవి యస్థిరములు. శరీరేంద్రియాదులు గూడా నామరూపములతో నుండి నశించునవియే. అందువలన నవి యేవియు ఆత్మకావు. ఇట్టి దేహమున జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు, స్థూల సూక్ష్మ కారణ శరీరములు అను మూడింటియందును నేను నాదని వ్యవహరించు నదియే ఆత్మయని నిశ్చయించుకొనుము.

ఘటావభాసకో దీపో ఘటాదన్యో యథేష్యతే ।
దేహావభాసకో దేహీ తథాఽహం బోధవిగ్రహః ॥ 14

పుత్రమిత్రాదయో భావా యస్య తే చ ప్రియాః ప్రియే ।
దృష్టాస్సర్వప్రియతమః సోఽహమిత్యవధారయ॥ 15

పరప్రేమాస్పదతయా అనుభూతమహం సదా ।
భూయో దృష్టాని నిత్యన్తు సోఽహమిత్యవధారయ ॥ 16

యస్సాక్షిలక్షణో బోధ స్త్వంపదార్థస్స ఉచ్యతే ।
సాక్షిత్వమపి బోధత్వమవికారితయాఽఽత్మనః ॥ 17

దేహేన్ద్రియమనః ప్రాణాహంకృతిభ్యో విలక్షణః ।
ప్రోషితశ్చాపి షడ్భావవికార స్త్వంపదాదిభిః ॥ 18

త్వమర్థమేవం నిశ్చిత్య తదర్థం చిన్తయేత్పునః ।
అతద్వ్యావృత్తిరూపేణ సాక్షాద్విధిముఖేన చ ॥ 19

నిరస్తాతిశయానందస్సత్య ప్రజ్ఞానలక్షణః ।
అదృశ్యత్వాదిగుణకః పరాకృతతమో మలః ॥ 20

నిరస్తాతిశయానందస్సత్య ప్రజ్ఞానలక్షణః ।
సత్తా స్వలక్షణః పూర్ణః పరమాత్మేతి గీయతే ॥ 21

సర్వజ్ఞత్వం పరేశత్వం తథా సంపూర్ణ శక్తితా ।
వేదైస్సమర్థ్యతే యశ్చ సోఽహమిత్యవధారయ॥ 22

మృదాద్యనేక దృష్టాన్తై స్తద్బ్రహ్మేత్యవధారయ ।

మఱియు సూదంటురాతి నినుమంటి తిరుగునటుల దేని సన్నిధాన మున శరీరేన్ద్రియాదులు తిరుగుచుండునో, జడంబులగు శరీరేన్ద్రియాదులు దేని సన్నిధినాత్మవలె తోచుచుండునో, సుషుప్తియందు శరీరేన్ద్రియ చిత్తంబులు లేకున్నను గాఢనిద్రనుండి మేల్కొనిన పిమ్మట నేను సుఖముగా నిద్రించితి ననుకొనున దేదియో అదే ఆత్మ యనబడును. దీపము ఘటాదులను ప్రకాశింపజేయుచు ఘటాదులకంటె వేరుగానుండి ప్రకాశించుపగిదినాత్మయు దేహేన్ద్రియాదులను ప్రకాశింపజేయుచు నా దేహేంద్రియాదుల కంటె వేరుగనుండి వానిని ప్రకాశింపజేయునని యెఱుంగుము. ఆత్మ పరమానంద స్వరూప మగుటవలన వానికి దారపుత్ర మిత్రాదులు ప్రియు లగుచున్నారు. ప్రేమాస్పదమగు వస్తువెద్దియో అదియే యాత్మయని గ్రహింపుము. ఏది దారపుత్రాదులకంటెను, సర్వప్రియ వస్తువులకంటెను మిగుల ఇష్టమైనదో అదియే ఆత్మయని నిర్ధారణచేసికొనుము.

త్త్వమసి' మొదలగు వాక్యము లందలి 'త్వం' అనుపదమునకు సర్వజ్ఞ త్వాది గుణవిశిష్టమైన సచ్చిదానంద స్వరూపమని యర్థము. 'అసి' అనునది జీవాత్మపరమాత్మల కైక్యమును బోధించును. ఈ రీతిగా వచించు నపుడు జీవాత్మనిష్ఠమైన కించిద్జ్ఞత్వాది ధర్మములకును, ఆత్మనిష్ఠమైన సర్వజ్ఞత్వాది ధర్మములకును పరిహారము గలుగగా శేషించిన సచ్చిదానంద స్వరూప మొకటియే నిలుచును. అదియే ఆత్మ. షడ్భావవికారములు దేహ లక్షణములు.

జనించుట, పెరుగుట, పండుట, క్షీణించుట, చచ్చుట యనునివి శరీరమునకేగాని యాత్మకుండవు. ఆత్మకు కామక్రోధములు మొదలగు షడ్వర్గములు, స్థూలసూక్ష్మములు మొదలగునవి లేవు. ఆత్మ సత్యజ్ఞానానంద స్వరూపమై పరిపూర్ణత్వము గలది. వేదంబులచే దేనికి సర్వజ్ఞత్వము, ఉపదేశత్వము, సంపూర్ణ సామర్థ్యము స్థిరీకరింపబడు చున్నవో అదియే ఆత్మ.

జీవాత్మనా ప్రవేశశ్చ నియన్తృత్వం చ తాన్ప్రతి ॥ 23

శ్రూయతే యస్య దేవేషు తద్బ్రహ్మేత్యవధారయ ।
కర్మణాం ఫలదాతృత్వం యస్యైవ శ్రూయతే శ్రుతౌ॥ 24

జీవానాం హేతుకర్తృత్వం తద్బ్రహ్మేత్యవధారయ ।
తత్త్వం పదార్థౌ నిర్ణీతౌ వాక్యార్థశ్చింత్యతేఽధునా ॥ 25
తాదాత్మ్యమత్ర వాక్యస్థార్థయోరేవ యథార్థయోః ।
ప్రత్యగ్బోధో య అభాతి సోఽద్వయానందలక్షణః ॥ 26

అద్వయానందరూపశ్చ ప్రత్యగ్బోధైకలక్షణః ।
ఇత్థమన్యోన్యతాదాత్మ్యప్రతిపత్తిర్యదా భవేత్ ॥ 27

అబ్రహ్మత్వం త్వమర్థస్య వ్యావర్త్యేచ యదైవ హి ।
తత్త్వమస్యాదివాక్యం చ తాదాత్మ్యప్రతిపాదనే ॥ 28

లక్ష్యే తత్త్వంపదార్థే వా ఉపాదానప్రవర్తనే ।
హిత్వా తే శబలే వాక్యే వాక్యార్థప్రతిబోధనే ॥ 29

ఒక కుండను జూచి మృణ్మయ మనుకొని తక్కిన కుండలన్నియు నీ విధంబుగనే మృణ్మయంబులని నిశ్చయించుకొనుమాడ్కి ఒక్క దేహాన్తర్యామి యగు జీవాత్మ పరమాత్మయేయని తెలిసికొని, శేషించిన సర్వదేహాన్తర్యామి యగు జీవాత్మ పరమాత్మయేయని నిర్ధారణ నెఱుంగుము. జీవులచే కర్మఫల మనుభవింప జేయువాడు పరమేశ్వరు డనియు, జీవులు కర్మఫలభోక్తలనియు, ఈశ్వరుడు కర్మఫల ప్రదాతయనియు వేదవేదాంగములు నుడువుచున్నవి.

సుఖార్థే తే వినా భూతే ప్రతీతిర్లక్షణోచ్యతే ।
తత్త్వమస్యాదివాక్యేషు లక్షణా భాగలక్షణా ॥ 30

సోఽయమిత్యాదివాక్యస్య పదయోరివ నో పురా ।
అహం బ్రహ్మేతి వాక్యార్థబోధో యావద్దృఢీభవేత్ ॥ 31

శమాదిశమితస్తావదభ్యసేచ్ఛ్రవణాదికమ్ ।
శ్రుత్యాఽఽచార్య ప్రసాదేన దృఢబోధో యదా భవేత్ ॥ 32

నిరస్తా శేష సంసారనిదానః పురుష స్తదా ।
కించిత్కాలమనారబ్ధం కర్మవిత్తస్య సంక్షయే ॥ 33

నిరస్తాతిశయానందవైష్ణవం పరమం పదమ్ ।
పునరావృత్తిరహితం కైవల్యం పదమశ్నుతే ॥ 34

తస్మాదాత్మవివేకార్థమాదౌ కర్మ సమాచరేత్ ।
వినా యచ్ఛ్రవణేనైవ కర్మ కర్తుం న రోచతే ॥ 35

పుమాన్గురుం ప్రసాద్యైవ శ్రుత్వా తస్మాత్ప్రయత్నతః ।
తతో విచ్ఛిన్నవృత్తాన్తః కృతే కర్మణ్యథావిధి ॥ 36

తత్కర్మఫలమత్యంతం తత్తుష్ట్యై విష్ణవేఽనఘ ।
కర్మణా సుకృతేనైవ ప్రాప్య జన్మాన్యనేకశః ॥ 37

తతో మోక్షమవాప్నోతి యోగయుక్తో విశేషతః ।
విముక్తకర్మబన్ధోభూర్నాత్ర కార్యా విచారణా ॥ 38

ఇత్థం యత్నేన సంపృష్టమబ్రవీదంగిరో మునిః ।
భూయోఽపి సమువాచేత్థం మహాసన్తోషధీర్ధ్రువ ॥ 39

అందువలన మానవుడు శమదమంబులు మొదలగు గుణ సమ్పత్తిగల వాడై, సాధన చతుష్టయ సమ్పన్నుడై గురుశుశ్రూష యొనర్చి తత్త్వమస్యాది వాక్యంబులచే జీవాత్మ పరమాత్మల కైక్యజ్ఞానము గలవాడైనచో సాంసారిక సంబంధమైన భ్రాంతు లన్నియు నశించి ముక్తు డగును. ఆ జ్ఞానముత్పన్న

మగుటకు ముందు కొంతకాలము మంచిపనులను జేయవలయును. ఆ పనులవలన చిత్తశుద్ధియు, దానివలన భక్తి జ్ఞాన వైరాగ్యంబులును, దానివలన ముక్తియు చేకూరును. అందుచే కొంతకాలము సత్కర్మానుష్ఠానుపరుడు కావలెను. అనేక జన్మలందు మంచిపనుల నాచరించినగాని ముక్తికాంత లభింప నేరదని యంగిరసుడు వచించి మరల వాని కిట్లనియె.

పంచమాధాయము సమాప్తము



# షష్ఠాధ్యాయము

## సర్వసార సంగ్రహము

ప్రక్షీణాశేషపాపానాం జ్ఞానే ధ్యానే భవేన్మతిః ।
పాపోపహతబుద్ధీనాం తద్వార్తాఽపి సుదుర్లభా ॥

పుణ్యకర్మలచే, వ్రతానుష్ఠానముచే జీవులకు పాపము నశించునప్పుడే భగవద్భక్తియందును, ఆత్మజ్ఞానమందును ప్రవేశము గలుగును. పాపజీవు లయినచో పుణ్యకార్యములలో, దైవజ్ఞానములలో వారి మనస్సు ప్రవేశించదు. అట్టి వాక్యమునుగూడ వినుటకైనా భాగ్యము గలిగియుండరు.

విశేషార్థము:- రోగముచే అరుచిగల జిహ్వ గలవానికి మంచి పదార్థ ములు సహా చేదుగానే యుండును. ఔషధసేవనముచే రోగశమనము గలిగి నప్పుడు ఆహార పదార్థములయందెటుల రుచి జనించునో, అట్లే పాపము నశించునప్పుడు జీవికి పుణ్యబుద్ధి యుదయించును.

సాధు త్వయోదితా వాణీ లోకోద్ధరణహేతవే ।
పూర్వకర్మవిపాకేన సత్త్వశుద్ధిః ప్రజాయతే ॥

వసిష్ఠుడు జనకునితో నిటులనెను. మీ రడిగిన చాతుర్మాస్యవ్రతము

చాలా పవిత్రమైనది. లోకోద్ధారణ హేతువైనది. ఇట్టి మాహాత్మ్యము వినవలెనను కోరికయు పూర్వపుణ్యము గలవారికే గలుగును. పుణ్యహీనులకు వినవలెనని గాని, ఆచరించవలెననిగాని సంకల్పమే పుట్టదు.

**యేషాంత్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।**
**తే ద్వన్ద్వ మోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః ॥**

పుణ్యకర్మలను జేసినట్టి మనుష్యులలో ఎవరికి పాపమయితే నశించిన దగు చున్నదో అట్టివారు శీతోష్ణాది ద్వంద్వమోహమువల్ల గలిగెడు సుఖ దుఃఖరూపమగు అజ్ఞానముచే విడువబడిన వారును, దృఢమైన వ్రతనిష్ఠ గలవారును నై నన్ను భజించుచున్నారు.

పాపకర్మలు నశించువారికి దృఢమైన వ్రతానుష్ఠానము లాచరించుటకు ప్రీతిగలుగును అని గీత.

**ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।**
**అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥**

పట్టుదలతో యత్నించుచున్న యోగనిష్ఠుడు పాపరాహిత్యము గలవాడై అనేకజన్మల యందభ్యసించుటవలన పొందదగిన యోగసిద్ధిని పొందిన వాడగుచున్నాడు. అట్టి యోగసిద్ధిని పొందిన తరువాత సర్వోత్తమమగు మోక్షసిద్ధిని పొందుచున్నాడు.

అనేకజన్మములలో పట్టుదలతో ననుష్ఠించుచు వచ్చినందువలన ఆత్మ శుద్ధి గలవానికి యోగనిష్ఠయందు ప్రీతిగలుగును. తర్వాత జ్ఞాననిష్ఠగలిగి మోక్షమును బొందును.

**స్వవర్ణాశ్రమధర్మేణ తపసా హరితోషణాత్ ।**
**సాధనం ప్రభవేత్పుంసాం వైరాగ్యాదిచతుష్టయమ్ ॥**

వారివారి వర్ణాశ్రమములకు తగిన అనుష్ఠానమువల్లను, వ్రతాది తనస్సు వల్లను, భగవంతుని యనుగ్రహమువల్లను మానవులకు ఆత్మశుద్ధి గలిగి

విషయవిరక్తి జనించునపుడు సాధనచతుష్టయ సమ్పత్తి గలుగును.

తపోభిః క్షీణపాపానాం శాన్తానాం వీతరాగిణామ్ ।
ముముక్షూణామపేక్ష్యోఽయమాత్మబోధో విధీయతే ॥

కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతాదులగు తపస్సులచే పాపము నశించినవారికిని, శాంతి గలిగినవారికిని, రాగద్వేషములు క్షయించినవారికిని, ముముక్షువులైన వారికిని ఈ ఆత్మబోధ మపేక్షణీయ మగుచున్నది.

దీనివలన వ్రతాద్యనుష్ఠానముల వల్ల ఆత్మశుద్ధి గలవారికి జ్ఞానోదయ మగునని గోచరించుచున్నది.

న సౌఖ్యాల్లభతే పుణ్యం కాయక్లేశాదవాప్యతే ।
మంథనేన యథా క్షీరాన్నవనీతం ప్రజాయతే ॥

మర్దనాదిక్షుదండానాం రసో యద్వత్ప్రజాయతే ।
తద్వచ్ఛరీరదండేన మహాధర్మః ప్రజాయతే ॥

ఇంద్రియసౌఖ్యములకు లోబడి శరీరమును పోషించువానికి పుణ్యము లభించదు. వ్రతములు సలిపి కాయక్లేశమును సహించువానికి పాపమునశించి పుణ్యము లబ్ధమగును. తరచుటచేతనే పెరుగునుండి వెన్న ఏర్పడుచున్నది. చెరకుగడను గానుగలో నుంచి త్రిప్పుట చేతనే దానినుండి రసము లభించును. ఆలాగున శీతోష్ణములనుసహించి వ్రతముల సలిపెడు వానికే తనలోగల మహాధర్మమగు ఆత్మజ్ఞానోదయ మగును.

అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యం దయాఽఽర్జవమ్ ।
క్షమా ధృతిర్మితాహారశ్శౌచం చేతి యమా దశ ॥

1. అహింస, 2. సత్యము, 3. దొంగిలింపకుండుట, 4. బ్రహ్మచర్యము, 5. దయ, 6. ఋజుత్వము, 7. క్షమ, 8. నిర్మలమనస్సు, 9. జపము, 10.వ్రతము. ఈ పదియు నియమము లనంబడును.

ఈ యమనియమములు ప్రతివ్రతము గలవారికిని, నిష్కామ కర్మ యోగులకును, భక్తియోగులకును, ధ్యానయోగులకును, జ్ఞానయోగుల కును సమానముగా అనుష్ఠేయములే, వెయ్యేల, పవిత్ర జీవితమును గడుపదలంపు గలవారందఱికిని ఇవి యుండియే తీరవలయును. సత్యమార్గ ప్రవర్తకుల కిది నేత్రద్వయము వంటిది. ఇవి రెండును లేనిచో దైవమార్గములో అంధప్రాయు లగుదురు.

అనాత్మన్యరుచిశ్చిత్తే రుచిశ్చాత్మని చేద్భవేత్ ।
పుణ్యపుంజేన శుద్ధం తత్ చిత్తమైకాగ్ర్యమర్హతి ॥

ఆత్మశుద్ధి గలిగినదానియొక్క గురుతు ఇట నిరూపింపబడుచున్నది. అనాత్మవస్తువులలో అరుచియు, ఆత్మజ్ఞానములో రుచియు ఎప్పుడు గలుగునో అప్పుడు అన్తఃకరణము శుద్ధమైనదని తెలియవలయును. ఇది పూర్వ పుణ్యవిశేషముగలవారికే సిద్ధించును. దీనివలన చిత్తమున కేకాగ్రత లభించును. ఇదే వ్రతాద్యనుష్ఠానములచే గలిగెడు ప్రయోజనము.

విషయాసంగరూపో యః పాప్మాఽసావాసురత్వతః ।
విద్యేచ్ఛాం ప్రతిబధ్నాతి సోఽయమాదౌ నివర్త్యతామ్ ॥

విషయాసక్తి స్వభావ మేది గలదో అది పాపస్వరూప మనియు, అసుర స్వభావ మనియు గ్రహింపవలయును. అది ఆత్మజ్ఞానేచ్ఛను అడ్డగించును. కావున ముముక్షువులు మొట్టమొదట నీ విషయవాంఛను రహిత మొనర్చ వలయును.

కామ ఏవ మనుష్యాణాం పిధానం బ్రహ్మబోధనే ।
తస్మాత్కామం త్యజన్ధీరో జ్ఞానమాప్నోతి మోక్షదమ్ ॥

మనుష్యులకు బ్రహ్మమార్గమున విషయాసక్తిరూపమగు కామమే గొప్ప ప్రతిబంధ మగుచున్నది. అందువలన ధీరుడు ఈ కామమునే ముందుగా త్యజించవలయును. అట్లయిన మాత్రమే మోక్షము నొసగెడు జ్ఞానమును పొందగలుగును. దీనియందు సంశయము లేదు.

జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః ।
యథాఽఽదర్శతలప్రఖ్యే పశ్యత్యాత్మానమాత్మని ॥

వ్రతానుష్ఠానముల చేతను, పుణ్యకర్మలచేతను మానవులకు పాపక్షయము గలుగునప్పుడు ఆత్మజ్ఞానోదయము గలుగును. నిర్మలమైన అద్దమందు తనరూపము ఎటుల స్పష్టముగా గోచరమగునో ఆలాగున ఆత్మయందు పరమాత్మను దర్శింపగలుగును.

లోకయాత్రాం ప్రయత్నేన వర్జయేదాత్మచిన్తకః ।
నాన్యోపనిషదం విద్యామభ్యసేన్ముక్తిహేతుకీమ్ ॥

ఆత్మనిష్ఠగలవాడు లోకయాత్రా స్వభావమును పూర్తిగా విసర్జించవలయును. మోక్షమును గలిగించెడు ఉపనిషద్విద్యను .మాత్రమే పఠించవలయును. ఇతరములగు ప్రాపంచిక గ్రంథములను చదువకూడదు.

ఆత్మసమ్మిత మాహార మాహరేదాత్మవాన్యతిః ।
అత్యన్తక్షుధితస్యాపి సమాధిర్నైవ జాయతే ॥

వ్రతానుష్ఠాన నిష్ఠగలవాడు తన అనుష్ఠానమునకు తగినంత ఆహారమునే గ్రహించవలయును. మిక్కిలి ఆకలిగల వానికిని, మిక్కుటముగా భుజించిన వానికిని సమాధినిష్ఠయందు మనస్సు నిలువజాలదు.

మితాశనో భవేన్నిత్యం భిక్షుర్మోక్షపరాయణః ।
కామక్రోధాదయో దోషా న భవన్తి మితాశనాత్ ॥

వ్రతనిష్ఠగలవాడు మితాహారము గలిగియుండవలయును. అట్టి మితాశనముగలవానికి కామక్రోధాదిదోషములు నశించును.

యదా సర్వే ప్రముచ్యన్తే ఇతిన్వితి చ వాజినః ।
కామబంధనమేవేదం వ్యాసోఽప్యాహ వదేవదే ॥

ఎప్పుడు అన్తఃకరణములోగల సమస్త కామములు వదలిపోవునో అప్పుడు

మోక్షము గలుగునని వేదార్థము నెఱింగిన పరమఋషులు చెప్పిరి. జీవునికి కామమే పరమబంధమని శ్రీవేదవ్యాసభగవానులు పదేపదే చెప్పిరి.

**కామబన్ధనమేవేదం నాన్యదస్తీహ బంధనమ్ ।**
**కామబన్ధనముక్తో హి నేహ భూయోఽభిజాయతే ॥**

జీవులకు ఈ కామమే బంధమై యున్నది. వేఱొక బన్ధమే లేదు. ఇట్టి కామబంధమునుండి విడివడినవాడు తిరుగా జన్మించనే జన్మించడు. అనగా ముక్తు డగునని భావము.

**కామానాం హృదయే వాసః సంసార ఇతి కీర్తితః ।**
**తేషాం సర్వాత్మనా నాశో మోక్ష ఉక్తో మనీషిభిః ॥**

హృదయములో నెంతవరకు విషయవాసన లుంటున్నవో అదియే సంసారము. అవి యెప్పుడు సంపూర్ణముగా నశించునో అట్టి స్థితియే మోక్ష మనంబడును.

**ఆత్మశుద్ధివిహీనస్య సకలం కర్మ నిష్ఫలమ్ ।**
**తత్సర్వం విద్ధి శుద్ధాత్మన్ వ్యంజనం తామ్రకే యథా ॥**

ఆత్మశుద్ధిలేనివాని సమస్తసత్కర్మలు నిష్ఫలము లగుచున్నవి. అదెటుల నగా ఓ బుద్ధిమంతుడా! కళాయిలేని రాగిపాత్రలోవండిన పప్పు పులుసు వంటిదియే యగును.

**శుద్ధిద్వయం మహత్కార్యం దేవానామపి దుర్లభమ్ ।**
**కౌపీనశుద్ధిః ప్రథమా వాక్యశుద్ధిరనన్తరా ॥**

ద్వివిధశుద్ధులు మహత్తయిన ఫలమును గలుగజేయునవై యుంటు న్నవి. ఇవి దేవతలకుగూడ మహాదుర్లభములు. అవి యేవి అనగా 1. కౌపీన శుద్ధి (అస్ఖలిత బ్రహ్మచర్యము) 2. వాక్శుద్ధి (సత్యభాషణము).

**ద్వయమేతన్న సిద్ధం చేత్ జీవితం తు నిరర్థకమ్ ।**
**యథా త్వం విద్ధి పుణ్యాత్మన్ రన్ధ్రపాత్రే చ పాచనమ్ ॥**

ఈ శుద్ధిద్వయ మెవనికి సిద్ధముగా లేదో అతని జీవితము వ్యర్థమే. అదెటులనగా వినుమా! ఓ పుణ్యాత్మా! ఎంత గొప్పదగు మంచిపాత్ర యయినను ఒక రంధ్రముండిన ఏలాగున పచనక్రియకు (వండుటకు) ఉపయోగ పడదో, అట్లుండగా రెండు రంధ్రములుండిన మరల దానిని గురించి చెప్పవలయునా!

బ్రహ్మచర్యమహింసా చ సత్యమామిషవర్జనమ్ ।
వ్రతేష్వేతాని చత్వారి చరితవ్యాని నిత్యశః ॥

చాతుర్మాస్యాదియే వ్రతములను ఆచరించువారైనను ఈ నాలుగు ధర్మములను తప్పక ఆచరించవలయును. అప్పుడే ఆ వ్రతము ఫలమును గలుగజేయును. అవి యేవనగా, 1.బ్రహ్మచర్యము, 2. అహింస, 3. సత్యము, 4. మాంసవర్జనము.

విహితస్యాననుష్ఠానాన్నిషిద్ధస్య చ సేవనాత్ ।
అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతనమృచ్ఛతి ॥

విహితమైన అనుష్ఠానమును చేయకపోవుటచేతను, నిషిద్ధ కార్యము లలో ప్రవేశించుటచేతను, ఇంద్రియనిగ్రహము లేకపోవుటచేతను మనుజుడు పతితుడగుచున్నాడు. సాధనాపరులలో నెవరైన పతితులై పోయినచో ఈ మూడింటిలో ఏదో యొకదానివలననే వారికి పతనము గలిగియుండును.

నాసమానసహాయేషు నివసేద్యోగవిత్క్వచిత్ ।
వసేత్సమానశీలేషు సుశీలేషు తపస్విషు ॥

సాధకుడు తనకు సమానమైన స్వభావము గలవారుండు స్థలములో నుండవలయును. అట్లు సమానగుణము లేని స్థలములో ఒకప్పుడును ఉండరాదు. నిర్మలశీలమును, పుణ్యస్వభావమును, తపస్సును గలవారుండు ప్రదేశమే యుత్తమము.

ముహూర్తమపి నాపీత దేశే సోపద్రవే యతిః ।

ఉపద్రుతే తు మనసి సమాధిర్నైవ జాయతే ॥

అనుష్ఠానపరుడు ఒక ముహూర్త సమయమైనను ఉపద్రవముగల స్థలములో నివసింపగూడదు. ఉపద్రవస్థలములో నుండిన మనస్సు నిర్మల స్థితి గలిగి నిర్వికల్ప సమాధియందు మనోలయము కాదు.

నానుష్ఠానాత్పరం కార్యం త్రిషు లోకేషు విద్యతే ।
సత్యం సత్యం పునస్సత్యమితి మామకభాషితమ్ ॥

అనుష్ఠానమునకు మించినది మూడు లోకములలోను మఱియొకటి లేదు. ఇది సత్యము. ఇది సత్యము. ఇది నాయొక్క మనఃపూర్వక సూక్తి.

షష్ఠాధ్యాయము సమాప్తము



# సప్తమాధ్యాయము

## ఓంకారధ్యానము

ఓంకారం బిందుసంయుక్తం నిత్యం ధ్యాయన్తి యోగినః ।
కామదం మోక్షదం చైవ ఓంకారాయ నమో నమః ॥ 1

బిందువుతో గూడిన ఓంకారమును యోగులు నిత్యము ధ్యానించుచున్నారు. తన సంకల్పసిద్ధిని, మోక్షమును గలుగజేసెడి అట్టి యోంకారమును గూర్చి నమస్కారము నమస్కారము.

ఓమితి స్మరణేనైవ బ్రహ్మజ్ఞానం పరావరమ్ ।
తదేవ మోక్షసిద్ధిం చ తదేవామృతమశ్నుతే ॥ 2

ఓంకారమును స్మరించుటమాత్రము చేతను పరబ్రహ్మ స్వరూపమైన బ్రహ్మజ్ఞానము పొందబడుచున్నది. అదియే మోక్షసిద్ధి యగుచున్నది. అదియే అమృతప్రాప్తి యగుచున్నది.

స్మరణాత్కీర్తనాద్వా పి శ్రవణాచ్చ జపాదపి ।
బ్రహ్మ తత్ప్రాప్యతే నిత్యమోమిత్యేతత్పరాయణమ్ ॥ 3

ఈ ఓంకారమును మనస్సులో స్మరించుటవల్లను, వాక్కుతో నుచ్చరించుటవల్లను, చిత్తైకాగ్రతతో వినుటవల్లను, జపించుటవల్లను, నిత్యము దీనియొక్క అనుష్ఠానమువల్లను, నిత్యమైన పరబ్రహ్మమును మానవుడు పొందుచున్నాడు. అదియే మోక్షస్థానము. ఈ పై చెప్పబడిన నాలుగువిధము లలో దేనిని ఆచరించినను ముక్తి గలుగుచున్నది.

ఓమిత్యేకాక్షరధ్యానాద్విష్ణుర్విష్ణుత్వమాప్తవాన్ ।
బ్రహ్మ బ్రహ్మత్వమాపన్నశ్శివతామభజచ్ఛివః ॥ 4

ఏకాక్షరమగు ఓంకారముయొక్క ధ్యానప్రభావమువల్లనే శ్రీమహా విష్ణువు పాలనశక్తి గలవాడాయెను. ఆలాగున ఓంకార ధ్యానప్రభావమువలననే బ్రహ్మదేవుడు సృష్టి జేయశక్తిగలవాడాయెను. అదేరీతిగా ప్రణవధ్యానమువల్లనే శివుండు సర్వమును తనలో లయముజేసెడు శక్తిగలవాడాయెను. బ్రహ్మ దేవునికిగల బ్రహ్మత్వమున్ను, మహావిష్ణువునకుగల విష్ణుత్వమున్ను, మహా శివునికి గల శివత్వమున్ను ఈ ప్రణవధ్యానమువల్లనే సిద్ధించును.

నాసాగ్రే దృష్టిమారోవ్య హస్తపాదౌ చ సంయమేత్ ।
మనస్సర్వత్ర సంగృహ్య ఓంకారం తత్ర చిన్తయేత్ ॥ 5

ప్రణవధ్యాన విధానమును ఈ మంత్రము దెలుపుచున్నది. కరచరణ ములను చక్కగా అణచినవాడై ఆసనములో గూర్చుండి నాసికాగ్ర మందు దృష్టిని నిలిపినవాడై, మనస్సును అన్నిటిలోనుండియు వశీకరించిన వాడై, ఓంకారవాచ్యుడగు పరమాత్మయందు లయపరచినవాడై, ప్రణవమును ధ్యానించవలయును.

జపేచ్చ ప్రణవం నిత్యం జితాత్మా విజితేన్ద్రియః ।
పఠేదుపనిషద్వాక్యం వేదన్తార్థాంశ్చ చిన్తయేత్ ॥ 6

బ్రహ్మనిష్ఠుని అనుష్ఠాన మీమంత్రమందు దెలుపబడుచున్నది.

ఇంద్రియము లన్నిటిని మనస్సును లెస్సగా జయించినవాడై నిత్యమున్ను ప్రణవమును అర్థసహితముగా శక్తికొలది జపమొనరించవలయును. జపానంతరము ఉపనిషత్తుల పారాయణము చేయవలయును. ఇతర సమయములలో వేదాంతార్థములను చక్కగా చింతన చేయవలయును.

ప్రణవప్రభవో బ్రహ్మా ప్రణవప్రభవో హరిః ।
ప్రణవప్రభవో రుద్రః ప్రణవో హి పరో భవేత్ ॥ 7

ప్రణవమునుండియే బ్రహ్మదేవుడు పుట్టెను. ప్రణవము నుండియే విష్ణువున్ను జనించెను. ప్రణవమునుండియే శివుండును ఉదయించెను. కావున ప్రణవము అన్నిటికన్న అధికమయినది.

అర్థమాత్రం తు యద్గ్రాహ్యం చిత్తమాదాయ పార్థివ ।
అర్థస్వరూపవద్భాతి సమాధిస్సోఽభిధీయతే ॥ 8

ఓ రాజా! చిత్తమును స్వాధీనము చేసికొని ప్రణవార్థమాత్రమై గ్రాహ్యమగునది యేదిగలదో అట్టి, అర్థరూపమాత్రమై వెలిగెడి స్థితియేది గలదో అదియే నిజమైన సమాధి యనబడును. అనగా ఓంకారముయొక్క అర్థమగు పరబ్రహ్మస్వరూపమై ధ్యానములో నిలకడ గలిగియుండుట యేదియో అదియే సమాధియని చెప్పబడును.

యావజ్జీవం జపేన్మన్త్రం ప్రణవం బ్రహ్మణో వపుః ।
హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్షప్రదాయకః ॥ 9

బ్రహ్మనిష్ఠుడు యావత్కాలము బ్రహ్మస్వరూపమగు ప్రణవమంత్రము జపించవలయును. ఆ జపము హ్రస్వమైనచో సమస్తపాపములను భస్మమొనర్చును. దీర్ఘమగునేని ముక్తిని గలుగజేయును. ఒక మాత్రాకాలమును హ్రస్వమనియు, రెండు మాత్రల కాలమును దీర్ఘమనియు గ్రహించవలయును.

ప్రాధాన్యం శ్రూయతే శ్రుత్యా ప్రణవస్య జపాదిషు ।

తస్మాత్సర్వప్రయత్నేన ప్రణవైకపరో భవేత్ ॥ 10

జపధ్యానాదులలో ప్రణవముయొక్క ప్రాధాన్యమే వేదముచేత వినబడు చున్నది. అందువల్ల అన్ని విధములగు ప్రయత్నముల చేతను ప్రణవధ్యాన పరుడవు కమ్ము.

మృద్వాసనే సమాసీనో జితచిత్తేన్ద్రియక్లమః ।
ఓమిత్యుచ్చారయేత్తావన్మనో యావత్ప్రసీదతి ॥ 11

మెత్తని ఆసనమందు కూరుచుండి యింద్రియాదివృత్తులను నిశ్చలము జేసికొని మనస్సు లీనమై బ్రహ్మాకారమగు పర్యన్తము ఓంకారమంత్రమును పరమాత్మ భావనతో ధ్యానము చేయవలయును.

మెత్తని ఆసనమైనచో కాలికి నొప్పితగులదు. ఎంతసేపైనను కూర్చుండ వచ్చును.

తైలధారామివాచ్ఛిన్నం దీర్ఘఘంటానినాదవత్ ।
ఉపాస్యం ప్రణవస్యాగ్రం యస్తం వేద స వేదవిత్ ॥ 12

ఒక పాత్రనుండి మరియొక పాత్రలోనికి తైలమును పోయునప్పుడు ఏలాగున అవిచ్ఛిన్నముగా పడుచుండునో, మరియు గొప్ప ఘంట వాయించిన తర్వాత ఆ ధ్వని యేలాగున లయమొందు చుండునో ఆలాగున ధ్యాన మందు లయముగలవాడై ప్రణవము యొక్క అర్ధమాత్రను ఉపాసించ వలయును. అట్లు చేయువాడు వేదమును చదువకపోయినను వేదార్థమును ఎఱింగినవాడే యగును. అటుగాని వాడు వేదమును చదివినను చదువని వానికి సమానుడే.

ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే ।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥ 13

ఓంకారమును ధనుస్సుగాను, ఆత్మను (మనస్సును) శరీరముగాను బ్రహ్మమును లక్ష్యముగాను జేసికొనినవాడై అప్రమత్తుడై ధ్యానము చేయగా, బాణము లక్ష్యములో చేరునట్లు వీడును బ్రహ్మత్వమును నొందగలుగును.

ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్ ।
జ్ఞాననిర్మథనాభ్యాసాత్ దేవం పశ్యేత్ నిగూఢవత్ ॥ 14

ఆత్మను క్రింది అరణిగాను, ప్రణవమును పై అరణిగాను జ్ఞానమథనాభ్యాసమువలన పరమాత్మను చూడవలయును. ఎటులనగా అరణియందు అగ్ని కనపడకపోయినను, మథించునప్పుడెటుల వ్యక్త మగునో ఆత్మయొక్క స్థితియు ఆలాగుననే యుండును.

యుంజీత ప్రణవే చేతః ప్రణవో బ్రహ్మ నిర్భయమ్ ।
ప్రణవే నిత్యయుక్తస్య న భయం విద్యతే క్వచిత్ ॥ 15

మనస్సును ఓంకారార్థమగు పరమాత్మయందు బాగుగా జేర్పవలయును. ఆ ప్రణవము భయరహితమైన బ్రహ్మస్వరూపము. అట్టి బ్రహ్మ మును నిత్యమును ధ్యానించువాని కెచ్చోటను భయము లేదు.

ప్రణవం హీశ్వరం విద్యాత్ సర్వస్య హృది సంస్థితమ్ ।
సర్వవ్యాపినమోంకారం మత్వా ధీరో న శోచతి ॥ 16

అందఱి హృదయములో నుంటున్న పరమేశ్వరుని ప్రణవస్వరూపునిగా తెలిసికొనవలయును. అట్టి సర్వవ్యాపకమగు పరబ్రహ్మ స్వరూప ప్రణవమును తెలిసికొనిన ధీరుడు శోకము నొందడు. నిరతిశయానందమును పొందుచున్నాడు.

సమాప్తము

ఓంతత్సత్

